4-9-1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 63 సంచిక :36 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

కలర్ ఆటో జెరాక్స్
శ్రీ రాఘవేంద్ర ఆటో జెరాక్స్
రాధా థియేటర్ ఎదురుగా
నెల్లూరు : ఫోన్: 23469
లామినేషన్ సౌకర్యము కలదు.

ఏమి జరుగుతున్నదీ అర్థంకాక అందరూ నలిగిపోతున్నారు

# పరిశీలన కాదు – చిత్ర హింస!

ఎద్దుపుండు కాకికి రుచి అన్నసామెతను తలపింప జేస్తున్నది- రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాలపై ఢిల్లీ పెద్దల ధోరణి. నాలుగు రోజుల నుంచి హైదరాబాదులో జరుగుతున్న పరిశీలకుల ప్రహసనం చూసిన వారెవరికైనా కాంగ్రెస్ రాజకీయాల పట్ల విరక్తి కల్గకమానదు. రాష్ట్రాల విషయానికొచ్చేసరికి రాజీవ్ గాంధీ అయినా, పివి నరసింహారావు అయినా ఒకటేనని నిరూపిస్తున్నదీ ఉదంతం.

పన్నెండు మంది అసమ్మతి మంత్రులు రాజీనామా చేసినవాడు ప్రధానమంత్రి తాను హైదారబాదు వచ్చేవరకు ఎవరూ ఏమీ మాట్లాడ వద్దని హుకుంజారీ చేశారు. దాని ఉద్దేశ్యం తాను హైదరాబాదుకు వచ్చినపుడు సమస్య పరిష్కరిస్తానని చెప్పడమే కదా? కాని అది జరగలేదు. 29తేది హైదరాబాదు వచ్చినప్పుడు అసమ్మతి నాయకులకు కనీసం ఇంటర్వ్యూ కూడా ఇవ్వలేదాయన. ముఖ్యమంత్రికి సందు పట్టివ్వలేదు. ఏ మార్పుకైనా అసెంబ్లీ ముగిసే వరకు ఆగమన్నారు. ఆఖరి నిముషంలో విమానం ఎక్కబోతూ, హఠాత్తుగా, రాష్ట్రంలో వ్యవహారాలపట్ల త్వరలో చర్య తీసుకోంటామని ప్రకటించి, అందర్నీ సస్పెన్సులో పెట్టివెళ్లాడు ప్రధాని. ఆ చర్య ఏమిటో ఆయన వివరించలేదు.

దీని భావం బోధ పడక అందరూ జుట్టు పీక్కొంటున్న సమయంలో ఉన్నట్లుండి ఢిల్లీ పరిశీలకుల నియామకం వార్త వెలువడింది. ముఖ్యమంత్రికి ఢిల్లీనుంచి ఎవరో ఒక నాయకుడు వస్తున్నట్లు సూచాయగా తెలుసు కాని, వారు ముగ్గురనే సంగతి గాడ్గిల్ ప్రెస్ కాన్ఫరెన్స్‌లో ప్రకటించేవరకు తెలియదు. పరిశీలకులు వచ్చారు. కాని ఎందుకు వచ్చింది తెలియదు. ఏమి చేస్తున్నదీ తెలియదు. అంతా అయోమయం. ఇటు ముఖ్యమంత్రిని, అటు అసమ్మతీయులను మానసికంగా చిత్రహింస పెడుతున్నారు పరిశీలకులు. వారడిగే ప్రశ్నలకు ఒక పద్ధతి, క్రమం లేవు. ముఖ్యమంత్రి వర్గీయులు వెళ్తే మెడికల్ కాలేజీల గురించి, అభివృద్ధి కార్యక్రమాల గురించి మాట్లాడారు. నాయకత్వం మార్చేందుకు తాము రాలేదని చెప్పారు. ముఖ్యమంత్రి వ్యతిరేకులు కలిస్తే రాష్ట్రంలో పార్టీ ఎట్లావుంది, ఎన్నికలు పెడితే కాంగ్రెస్ గెలుస్తుందా వంటి ప్రశ్నలేశారు. వారి ధోరణి చూసి వారెందుకు వచ్చింది కనిపెట్టడం తలలు పండిన రాజకీయవేత్తలకూ అలివి కావడం లేదు. అందరూ విసిగి పోతున్నారు.

## గంటకు లక్ష ఓట్లు ఖాళీ!

రాష్ట్రంలో అసమ్మతి కార్యక్రమాల వల్ల అసెంబ్లీలో స్వపక్షీయులే సృష్టిస్తున్న అలజడి వల్ల గంటకు లక్ష ఓట్లు పోతున్నాయని ఢిల్లీపరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు. తమను కలిసిన ఒక ముఖ్య అసమ్మతీయ మంత్రితో వారీ వ్యాఖ్య చేశారు.

ఇది తెలిసో తెలియకో కాని, ముఖ్యమంత్రి మద్దతుదారుడైన ఒక ఎమ్మెల్యే, మీ రాక వల్ల పార్టీ మరింత గబ్బుపట్టిపోయిందని పరిశీలకులను గర్జించాడట.

అంత అవగాహన వున్న వారు ఇంత ఆగమెందుకు చేస్తున్నారో అర్థమే కాదు.

అసలు నాలుగు రోజుల పాటు ఢిల్లీ పరిశీలకులు హైదరాబాదులో తిష్టవేసి విచారణ జరపడమనేది పూర్వమెప్పుడూ జరగలేదు. ఇందరుపరిశీలకులు రావడం కూడా ఇదే ప్రథమం. మొదట వచ్చిన ముగ్గురూ చాలక గురువారం అదనంగా బొంబాయినుంచి శ్రీమతి ప్రతిభా పాటిల్‌ను పంపారు. ప్రధాని ఇటువంటి నిర్ణయాలు ఎందుకు తీసుకుంటున్నారో అనుహ్యం. ఆయన ఉద్దేశ్యమేమిటి? ముఖ్యమంత్రిని కొనసాగించాలను కుంటున్నారా? తొలగించాలను కుంటున్నారా? ముఖ్యమంత్రిని కొనసాగిస్తూ, అసమ్మతీయులను దువ్వడం ఆయన ఆలోచనా? లేక తొలగింపు నింద తనపై పడకుండడానికి ఈ నాటకమా? హైదరాబాదు నుండి ఢిల్లీ విమానం ఎక్కేముందే పరిశీలకుల విషయంలో ఆయన ఒక నిర్ణయానికి వచ్చారా? లేక ఢిల్లీ వెళ్ళిన తర్వాత కల్గిన ఆలోచనా? పరిశీలకులు వచ్చేది, వచ్చి ఏమి చేసేది ముఖ్యమంత్రికి తెలుసా? అసెంబ్లీ వరకు ఆగమని అందరికీ సలహా ఇచ్చినవాడు, తాను మాత్రం ఎందుకు ఆగ లేకపోయాడు? వందమంది ఎమ్మెల్యేలు తిరుగుబాటు ప్రకటించిన కర్ణాటకలో బంగారప్పను తాకకుండా, ఏ నిర్ణయమూ తీసుకోకుండా, 30మంది ఎమ్మెల్యేలు సైతం లేని ఆంధ్ర వ్యవహారాలలో అంత తొందరపాటు ఎందుకు? తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న వీరప్ప పోర్టుఫోలియో పెరికి వేయడానికి బంగారప్పకు అనుమతి ఇచ్చి, జనార్ధనరెడ్డిని మాత్రం ఎందుకు నిలిపారు? సి సిఎల్‌పి సమావేశం పెట్టి బలం నిరూపించుకొంటానని ముఖ్యమంత్రి అడిగితే కాదనడానికి కారణమేమి?అసలు ఢిల్లీ పెద్దల ఆలోచనల ఏమిటి? సమాధానాలు చెప్పేవారే లేరు.

పరిశీలకుల దగ్గర మాత్రం ముఖ్యమంత్రి తన బలాన్ని నిస్సందేహంగా ప్రదర్శించారు. మెజారిటీ ఎమ్మెల్యేలు తమ మద్దతు ముఖ్యమంత్రికే నని చెప్పడమే కాదు- అసలు మీరెందుకు వచ్చారని ఎదురు ప్రశ్నవేశారు. నాయకుణ్ణి మార్చే ఉద్దేశ్యంతో వచ్చివుంటే వెనక్కి వెళ్ళిపొమ్మని . చీటికి మాటికి ముఖ్యమంత్రులను మారిస్తే 1983 నాటి పరిస్థితి పునరావృతమౌతుందని హెచ్చరించారు. 75శాతం మంది ఎమ్మెల్యేలు జనార్ధనరెడ్డికి మద్దతు నిస్తూ మాట్లాడినట్లు అంచనా! 20మంది హరిజన ఎమ్మెల్యేలు ఒకే పర్యాయం పరిశీలకులను కలిసి ముఖ్యమంత్రిపక్షంలో తామున్నట్లు దృఢంగా చెప్పవచ్చారు.

అసమ్మతి పక్షంలో ఎమ్మెల్యేలు లేరు. నాయకత్వం మార్పుకోసం తాము రాలేదని పరిశీలకులు స్పష్టంగా ప్రకటించినందువల్ల తటస్తులుగా వున్న

కొరవ 6 పేజీలో

## ఎవరు విలను? ఎవరు హీరో?

రసవత్తరంగా వున్న కాంగ్రెస్ రాజకీయ నాటకంలో హీరో ఎవరు? విలన్ ఎవరు? పరిశీలకులు విడిది చేసిన అతిథి భవనం బయట ఈ ప్రశ్నపై ఆసక్తికర చర్చ సాగింది. జనార్ధనరెడ్డికి రామభక్తుడుగా వుంటున్న జానకిరాం- ముఖ్యమంత్రి హీరో వంటివాడని, విలన్లు తపతపమని కొట్టే దెబ్బలు తట్టుకొని క్లైమాక్స్‌లో నాలుగేనాలుగు పిడి గుద్దలతో అందర్నీ మట్టి కరిపించేస్తాడని వ్యాఖ్యానించాడు. పరిశీలకుల దగ్గర జరిగే భాగోతం విలన్ల తూతూ మంత్రాలని ఆయన ఉద్దేశం. ప్రక్కనే వున్నఒక అసమ్మతి సానుభూతి పరుడు వెంటనే ప్రతిస్పందించి , ఆరు నెలలనుంచి, అసమ్మతి హీరోను ముఖ్యమంత్రి విలను చావుదెబ్బలు కొడ్తున్నాడని, ఈ పరిశీలకుల ముష్టిఘాతంతో అసమ్మతి హీరో, విలనేను మట్టి కరిపించేస్తాడని రిటార్ట్ చేశాడు.

వీరిద్దరిలో ఎవరు రైటు? హీరో ఎవరు విలనెవరన్నది తెల్చాల్సినవాడు ఢిల్లీలో వున్నాడు. తక్కిన వారంతా ప్రేక్షకులే!


వినాయక చవితి ఉత్సవాల నిర్వహణలో హైదరాబాదును మించి పోతున్నది నెల్లూరు. మండపాలవీధిలో నేత్రపర్వం చేస్తున్న నందివాహనారూఢుడైన గణపతి

# రాజేశ్వర రావు రాజీకి సిద్ధం?

రాష్ట్రంలో అసమ్మతి సంక్షోభానికి సృష్టికర్త అనదగిన పివి సమీప బంధువు శ్రీ రాజేశ్వరరావు ముఖ్యమంత్రితో సయోధ్యకు సమ్మతించాడని ఒక వదంతి. రాజేశ్వరరావుకు, ముఖ్యమంత్రికి రాజకీయ విభేధాలేవి లేవు. వ్యక్తిగతమైన కోపతాపాలున్నాయి. రాజేశ్వరరావు అడిగిన కొన్ని పనులను ముఖ్యమంత్రి నిరాకరించడమే స్పర్థకు మూలమని చెప్తారు. నోరు జారడం కూడా ఇద్దరి మధ్య స్పర్థను పెంచింది. పివి అనుమతి, ఆశీర్వాదం వున్నాయో లేదో తెలియదు గాని . రాజేశ్వరరావు నడుంబిగించిన తర్వాతే అసమ్మతి అవధులు మీరిందన్నది తెలిసిన సంగతే. అప్పటి వరకు ఒకరిద్దరు మంత్రులకు పరిమితమై వుండినది కాస్తా ఒక్కసారి పన్నెండు మంది మంత్రుల రాజీనామాకు కారణమైంది. తదనంతర పరిణామాలే పరిశీలకురాక, ప్రధాని జోక్యం వగైరా!

ఈ పరిస్థితు లలో రాజేశ్వర రావును సానుకూల పరచుకుంటే పరిస్థితి

కొరవ 6 పేజీలో

వరి విత్తనములు
NLR - 30674 NLR - 30426 Code - 18 - New Variety from J. Farm NLR 33359
అమ్మకమునకు కలవు
పి.వి.ఎన్. విద్యాకర రెడ్డి
కృషినగర్ (4 వ మైలు)
ముత్తుకూరు రోడ్, నెల్లూరు

# అశ్రుతర్పణం



మా అభివృద్ధి కొరకు నిరంతరం కృషి చేసిన

## గుండాల బుజ్జిరెడ్డి గారు (సుబ్బారెడ్డి)

(గుండాల వెంకటసుబ్బారెడ్డి & సన్స్ – నెల్లూరు)

**28.8.1992** తేది శుక్రవారం అకస్మాత్తుగా స్వర్గస్థులైరి

వారికి అశ్రుతర్పణం అర్పించుచున్నాము.

### వారి ఉత్తరక్రియలు

9.9.1992 తేది బుధవారం నెల్లూరు చిన్నబజారులోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

తమ్ముళ్లు–మరదళ్ళు: చంద్రశేఖర్ రెడ్డి – శ్రీదేవమ్మ; యుగంధర్ రెడ్డి; రఘునాథరెడ్డి – అనసూయమ్మ, రాధాకృష్ణారెడ్డి – సరస్వతి; ఉమామహేశ్వర రెడ్డి – కాంతమ్మ, గోపీనాథ్‌రెడ్డి – రాజేశ్వరి.

చెల్లెళ్లు: ఎన్.వి. సుగుణమ్మ, పి. లక్ష్మీకాంతమ్మ, సి. ఉమాదేవి. మరదళ్లు: సి. దయమంతి, ఆర్. రాజేశ్వరి.

బావమరదులు: ఆర్. పెంచలరెడ్డి, నారాయణరెడ్డి, దశరథరామిరెడ్డి, చెల్లెళ్లు: దయమంతి దేవి, హైమావతి, డాక్టరు పెంచలమ్మ, సీతమ్మ

కొడుకులు–కోడళ్లు: భాస్కర్‌రెడ్డి, పద్మజ; శ్యామ్ ప్రసాద్ రెడ్డి – శైలజ; సురేష్ రెడ్డి – సుప్రజ; రమేష్ రెడ్డి–నీరజ.

కూతుళ్లు–అల్లుళ్లు: సి. సుదర్శన, సి.ఆర్.కె. రెడ్డి; సి. హెచ్. మహాలక్ష్మి, మస్తాన్‌రెడ్డి; కె. సంధ్యారాణి – జనార్దన్ రెడ్డి, పి. సుచిత్ర – రాధాగోపాల్‌రెడ్డి; టి.శోభారాణి–అమర్‌నాథ్‌రెడ్డి; ఎన్. జ్యోతి–జయచంద్రారెడ్డి; ఎన్. రేణు – సాయికుమార్ రెడ్డి

మనుమలు–మనుమరాండ్రు: పద్మజ, హరీష్, వినయ్, ఉదయ్, శ్యాలినీ, శ్యామ్లి, పుష్యమి, పల్లవి, రాజేష్, అనూరాధ, కిరణకుమార్, రాహుల్, చందన, దీప్తి, దివ్య, ఆదర్శ్, జహ్నవి, జనని, శుభాష్, సాకేత్

మరియు బంధుమిత్రులు.

# జమీన్‌రైతు

## బాధాకరం

రాష్ట్ర బడ్జెట్ ఏ చర్చా లేకుండానే ఆమోదింప బడింది. ఏ శాసన సభ చరిత్రలోనూ ఈ విధంగా జరిగివుండదు. అత్యంత బాధాకరమైన విషయమిది.

శాసన సభల కార్యకలాపాలలో బడ్జెట్ ప్రతిపాదనలపై చర్చ చాలా కీలకమైనది. మన రాష్ట్రం వరకు కేవలం బడ్జెట్‌పై చర్చకు తప్ప శాసన సభ సమావేశమే జరగడం లేదు. ఎన్టీరామారావు ప్రారంభించిన దుష్టసాంప్రదాయమిది. ప్రతిపక్షం సవాళ్ళు ఎదుర్కొనే ధైర్యం లేక విమర్శల తాకిడి తట్టుకోలేక సాధ్యమైనంత వరకు అసెంబ్లీని వాయిదా వేయడానికే ప్రయత్నించేవారాయన. చెన్నారెడ్డి, జనార్ధనరెడ్డి లిద్దరూ ఆ సాంప్రదాయాన్ని పాటిస్తున్నారు. అంతేకాదు, చట్టపరంగా ఆరు నెలలకు ఒకసారి సమావేశం జరగాలన్న నిబంధన గడువు సమీపించినంత వరకు అసెంబ్లీని సమావేశ పరచడం లేదు. సంవత్సరంలో శాసన సభ సమావేశాలు జరిగే రోజులను వ్రేళ్ళమీద లెక్కపెట్ట గల్గిన పరిస్థితి ఏర్పడుతూంది. పార్లమెంట్ సమావేశాలు జరిగే తీరు చూసైనా నేర్చుకోవాలను కోవడం లేదు నేతలు. అధి కారంలోకి వస్తున్న నాయకులలో, 'నాయకత్వ లక్షణాలు' లోపించడమే దీనికి కారణం.

ఈనేపథ్యంలో, విధిలేని పరిస్థితులలో మాత్రమే జరుగుతున్న శాసన సభా సమావేశాలలోనూ ప్రజా సమస్యలపైన, కనీసం బడ్జెట్ పైన కూడా చర్చ జరగక పోవడం శోచనీయం. మెడికల్ కాలేజీల మంజూరు అక్రమమని, వాటిని రద్దుచేయాలని తెలుగుదేశం ఆందోళన చేస్తున్నది. మొదటి రోజునుంచి వారు ఈ సమస్యపైన అసెంబ్లీని అట్టుడికిస్తున్నారు. కార్యకలాపాలు జరగ నివ్వడంలేదు. సభలో బడ్జెట్ ప్రతిపాదించిన తర్వాత ఆరు రోజుల పాటు చర్చ జరగాలన్నది నియమం. ఆ ఆరు రోజులూ సమావేశాలలో ప్రతిష్టంభన ఏర్పడడంతో బడ్జెటును చర్చ లేకుండానే ఆమోదించినట్లు ప్రకటించారు. మెడికల్ కాలేజీల సమస్య ప్రధానమైనదే కావచ్చు- కాని దానికంటె బడ్జెట్ ఇంకా ప్రాధాన్యత కల్గిన అంశమని, ప్రతిపక్షం గుర్తించ లేక పోవడం విచారకరం. బడ్జెట్‌పై చర్చలోనే ప్రతిపక్షానికి, అధికార పక్ష శాసన సభ్యులకు కూడా సభలో ఏ అంశంపైన అయిన విపులంగా మాట్లాడే అవకాశం లభిస్తుంది. పార్లమెంట్‌లో కాని, అసెంబ్లీలో కాని ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించే సావకాశం మరెప్పుడూ లభించదు. అటువంటి అవకాశాన్ని వదులుకోవడం ప్రజలకు అన్యాయం చేయడమే కదా?

ప్రభుత్వం కూడా భలేమంచి ఛాన్సు అన్నట్లు ప్రవర్తించిందనుకోవాలి! మెడికల్ కాలేజీపై ఆందోళన జరుపుతున్న ప్రతిపక్షాన్ని పిలిపించి, బడ్జెట్‌పై చర్చ జరిగేంతవరకు ఆందోళన వాయిదా వేసుకోమని విజ్ఞప్తి చేసి వుండవచ్చు.

## పాకిస్తాన్ కవ్వింపు

జకార్త అలీన దేశాల శిఖరాగ్ర సభలో పాకిస్తాన్ ప్రధాని నవాబ్ షరీఫ్ కాశ్మీర్ వివాదాన్ని ప్రస్తావించడం కావాలని చేసిన కవ్వింపు చర్యగానే భావించాలి. అలీన సభలలో ద్వైపాక్షిక సమస్యలు చర్చించకూడదన్న నియమాన్ని కాలదన్ని ఆయనాసమస్యను లేవనెత్తడంలోనే పాకిస్తాన్ కుళ్లుబుద్ధి బయటపడుతున్నది. పొరుగునే ఉన్న భారత్ తనకంటె ముందునిల్చి, ప్రగతి సాధించడం చూసి ఓర్వలేక; ఆ పరుగుతో పోటీ పడలేని తమ చేతకానితనాన్ని తమ ప్రజల ముందు కప్పిపెట్టుకొను పాకిస్తాన్ నాయకులు ఎక్కడ అవకాశం దొరికితే అక్కడల్లా ఇట్లా కయ్యానికి కాలు దువ్వుతూనే వుంటారు.

నిజానికి కాశ్మీర్‌లో సమస్యను సృష్టిస్తున్నది పాకిస్తానే. అమాయక ముస్లింలను రెచ్చగొట్టి, తమ దేశం తీసుక వెళ్లి, శిక్షణనిచ్చి, ఆయుధాలు సరఫరా చేసి, నిధులు సమకూర్చి ఆ ప్రశాంత లోయలో అల్లకల్లోలం సృష్టిస్తున్నది పాక్ ప్రభుత్వం. కాశ్మీర్ తీవ్రవాదులకు వారి సాయం అందనిరోజు, కాశ్మీర్ సమస్యేలేదు. ఏ కాశ్మీరీయుడు కూడా భారత్‌నుంచి విడిపోవాలని కోరుకోవడం లేదు. తీవ్రవాద సమస్యవల్ల ఆ రాష్ట్రంలో టూరిజం పరిశ్రమ పతనమై, యాత్రికులు రాక, ఆదాయం లేక, జీవన వనరు కోల్పోయి ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు. ప్రజల పరిస్థితి అంత దయనీయంగా వున్నా, పాక్ నేతలు మాత్రం అక్కడి శాంతి నెలకొనకుండా చేయడానికి ప్రత్యక్షంగా ప్రయత్నిస్తున్నారు. సైన్యాన్ని ఎదిరించి, కాల్పులు జరిపి, తీవ్రవాదాలను లోపలకు చేరవేయడానికి ప్రయత్నిస్తున్నారు. మొగాడ్నికొట్టి మొగశాల కెక్కినట్లు అంతర్జాతీయ వేదికలపై కాశ్మీర్ ప్రజల పట్ల మొసలి కన్నీరు కారుస్తున్నారు.

షరీఫ్ విమర్శకు మన ప్రధాని శ్రీపివి హుందాగా సమాధానం చెప్పినా-పాకిస్తాన్ దుష్టబుద్ధిని ప్రతిఘటించడానికి ఎప్పుడో ఒకసారి దండ ప్రయోగం చేయక తప్పదన్పిస్తూంది. సంఘర్షణ , సమరం దేశహితానికి భంగకరమైనా ఏదోఒకనాడు అది తప్పదు. హిత వచనాలను పెడచెవిన పెట్టి, మూర్ఖంగా ప్రవర్తించే వారికి జ్ఞానం కల్పించాలంటె దండోపాయమే సరైన మందు.

## జమీన్‌రైతు

50 ఏళ్ళ క్రితం ఈ వారం శీర్షిక నిలపవలసి రావడం వల్ల ఈ మధ్యకాలంలో జమీన్‌రైతు పాత సంపుటాల నుంచి ఆసక్తికరమైన, ఇప్పటి పరిస్థితులకు వర్తించే విధంగా వున్న వ్యాసాలను పునర్ముద్రిస్తున్నాము. ఈ వారం మద్యపాన నిషేధోద్యమం పై ఆనాడే గాంధీజీ చేసిన ప్రకటన 30.4.1937 సంచిక నుంచి యదాతథంగా పునర్ముద్రిస్తున్నాము.

❂❂❂❂❂

### మద్యపాన నిర్మూలమునకు స్త్రీలు పూనుకొనవలెను

### గాంధీ మహాత్ముని హితవు

24 తేదిన వెలువడిన హరిజన పత్రికలో గాంధీ మహాత్ముడు మద్యపాన విషయమై ప్రకటించిన వ్యాసమందు క్రింది విధముగ తెల్పెను.

వెనుక సత్యాగ్రహమును ప్రారంభించి నేను కాలినడకన దండికి బయలు దేరినపుడు భారతదేశమున లక్షల కొలది స్త్రీలు నా విజ్ఞప్తిని ఆదరించి మద్యపాన నిర్మూలము కొరకు మిక్కిలి శ్రద్ధగా పనిచేసిరి. అందరును రాటములపైని నూలు వడుక సాగిరి. వేల కొలది స్త్రీలు సారా దుకాణముల వద్ద కేగి త్రాగుడును వదిలి వేయుడని త్రాగుబోతులను ప్రార్థించు చుండిరి. అపుడు చాలా మంది త్రాగుడును మానివేసిరి. వారిలో పరమ నీచులగు వారు కొందరు యిటుల బోధించుచున్న సోదరీ మణులను తిట్టుట, కొట్టుట మున్నగు దౌర్జన్యములను గూడ ఒనరించిరి. కాని దేశ సేవాపరాయణులగు సోదరీమణులు ధరిత్రీ దేవి వలెన అత్యధికమగు క్షమతో వాటిని అన్నిటిని సహింప గలిగి యుండిరి. మన దురదృష్టము వల్ల సత్యాగ్రహము విరమించుటకు పూర్వమే ప్రజలలో నిరుత్సాహ మధికమైనది. అన్ని విధములగు కార్యములును నిలిచి పోయినవి. స్త్రీలు తమ వాగ్దానమును నెరవేర్చి యుండలేదు. గాన నిపుడు గూడ నీ పనిని నెర వేర్చుటకు చాలమంది స్త్రీలు ముందంజ వేయుట ముఖ్యావసరము గానే యున్నది. మద్యపానమును నిర్మూలింపుడు, అని కాంగ్రెస్ వారు దేశమునందంతటను గూడ ప్రచురించి యుండిరి. దీనికిపుడు కాల నిర్ణయము చేయబడలేదు గాన దేశమున మద్యపానము పూర్తిగ సంతరించు వరకును గట్టి ప్రచారము జరుగుచునే యుండ వలెను. దీనికి స్త్రీలే ముఖ్యముగా తగిన వారు. ప్రచారమును చేసినపుడు దానిని నిలిపి వేయకుండ నిప్పటి వరకు వినమ్రతతోను దీక్షతోను కొనసాగించు చుండిన యెడల దేశమున త్రాగుబోతుల సంఖ్య యిప్పటికి నామ మాత్రము గనే యుండి యుండును.

గతించిన దానికి చింతింప నవసరము లేదు. ఇపుడు గూడ నందున కవకాశమున్నది. గాన స్త్రీలు ఈ ఉద్యమమును మరల ప్రారంభింప వలెనని నేను కోరు చున్నాను. తమ భర్తలు త్రాగుబోతులగుట వలన భర్తలలో నకరి సుగుణ దుర్గుణములలో రెండవ వారు భాగస్వాములగుచు నేయుందురు. స్త్రీలలో నిట్టి ప్రబోధమును కలిగించుటకు గూడ స్త్రీలె పూనుకొనవలెను.

లక్షల కొలది స్త్రీలు దేశమంతటను మద్యపాన నిర్మూల సంఘముల నేర్పరచి కట్టుబాటుతో పని చేయవలెను. త్రాగుడుకు సంబంధించిన లెక్కలను బాగుగా చదివి అవగతము చేసుకొనవలెను. ఈ దురల్వాటు యెందు వలన కలుగును. ఇది మరల దేని వలన తొలగును అను విషయములను గూడ వారు తెలుసుకొన వలెను. మీరు త్రాగుడు మాని వేయుడు అని చెప్పినంత మాత్రమున త్రాగుబోతులు దానిని మానరని మనకు అనుభవము వలన బాగుగా తెలిసియే యున్నది. ఈ దుర్వ్యసనమొక వ్యాధి వంటిది. కావున వ్యాధులను కుదుర్చుటకు వైద్యులు పరిశోధనలను చేయునట్లు సురాపాన వ్యాధిని నిర్మూలించు విషయమున వైద్యుల నడగిన స్త్రీలు దీనిని గూర్చి పరిశోధనలను చేయవలెను. సంస్కరణమునకు సంబంధించిన సకల విషయముల లోను నిరంతర పరిశ్రమ జరుగక తప్పదు.

### పాత సంపుటాల్లో.....

అత్యధిక మగు దుస్థితికి పాలైన స్త్రీలందరును కలిసి పట్టుదలతో పనిచేయునటుల అత్యధిక మగు లాభము కలుగునని నేను నిశ్చయముగా చెప్పగలను. సంఘమునకు మేలును కలుగజేయగల శక్తి పురుషులలో కంటె స్త్రీలలోనే మిక్కిలి హెచ్చుగా నున్నది గాని తమకిట్టి శక్తి కలదన్న, విషయమును స్త్రీలలో మిక్కిలి హెచ్చుమంది గ్రహించి యుండలేదు. వారు దానిని గుర్తించినచో వారికి బలమధికమగును. చాల కుటుంబములలో స్త్రీలు తమ భర్తల చర్యలను గూర్చి లేశమైనను శ్రద్ధ వహింపరు. అట్టి హక్కు తమకు లేదని తలచునట్టి స్త్రీలు చాలా మంది కలరు. భర్త సద్వర్తనమును భార్యయును కాపాడుట వారికి ప్రధాన కర్తవ్యమె యగుట కెట్టి సంశయములేదు. భార్యా

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పత్రికా స్వేచ్ఛ పై ప్రభుత్వం విధించిన నిర్బంధాలకు నిరసనగా 24.8.1942 నుండి 20.11.1942 వరకు, మూడు మాసాల పాటు 'జమీన్‌రైతు' ప్రచురణ నిలిపి వేయబడింది. అందువల్ల ప్రతివారం ప్రకటిస్తున్న '50 ఏళ్ళ క్రితం ఈ వారం' శీర్షిక మూడు నెలల పాటు వుండదు. పునర్దర్శనం 20.11.92 తేది సంచిక.

- సంపాదకుడు

# అమెరికా ప్రపంచ రౌడీనా?

ఇరాక్‌పై అమెరికా చేస్తున్న దౌర్జన్యాలు వీధిగూండాల అకృత్యాలను తలపింప జేస్తున్నాయి. వీధిరౌడి బలహీనుడైన వ్యక్తిని ఎన్నుకొని ,నడివీధిలో తన్ని, తన ప్రతాపం ప్రదర్శించినట్లు, ప్రపంచావరణంలో ఇరాక్‌పై దౌర్జన్యం చేయడం ద్వారా తన బలాన్ని ప్రదర్శిస్తున్నది అమెరికా! సద్దాం హుసేన్ దుర్మార్గుడే కావచ్చు; యుద్ధ దురహంకారే కావచ్చు; అతడి దగ్గర ఆయుధాలు సమకూరితే ఇరుగు పొరుగు దేశాలపై కయ్యానికి కాలుదువ్వవచ్చు. అంత మాత్రాన అతడ్ని అదుపుచేసే నెపంతో ఒక దేశంపై దౌర్జన్యానికి దిగడానికి అమెరికాకు ఎవరు అధికారం ఇచ్చారు? అదేమైనా ప్రపంచ పరిరక్షకురాలా? లేక అదేమైనాశాంతిని వాంఛించే పవిత్రురాలా?అమెరికా ఏ పనిచేసినా దానివెనుక స్వార్థం దాగివుంటుంది. కువైట్ విముక్తికోసం చేసిన యుద్ధమూ అంతే. అనాడు అమెరికాలో ఆయుధపరిశ్రమ మూతపడే పరిస్థితిలో వుండింది. దాన్ని కాపాడి, ఆయుధ నిల్వలు ఖర్చుచేయడానికి, పెట్రోలు సంపద కల్గిన దేశాలను తన కాలిక్రింద చెప్పులవలె అణచి పెట్టడానికి ప్రయత్నించింది అమెరికా. అంతపెద్ద యుద్ధం చేస్తే వారికి చిల్లిగవ్వ ఖర్చుకాలేదు. యుద్ధంలో ఓడినా, వ్యక్తిగతంగా దానోహమనని

### జనవాణి

సద్దాంహుసేన్‌పై కక్ష సాధించడానికి అమెరికా మళ్ళీ యుద్ధవాతావరణం సృష్టించడం అన్యాయం. ఐక్యరాజ్య సమితిని వారు తమ కీలు బొమ్మగా మారుస్తున్నారు. ఈ పరిస్థితి వల్ల నష్టం ఒక్క ఇరాక్‌కి కాదు- మొత్తం వర్ధమాన దేశాలన్నింటికీ చేటు! ఎప్పుడు ఎక్కడ ఏ నాయకుడు అమెరికాను ధిక్కరించినా బలప్రయోగంతో అణచివేసే ప్రయత్నం జరిగే ప్రమాదం వుంది. అది మానవాళి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకే ముప్పుతెస్తుంది. నూరేళ్లనాటి వలస సామ్రాజ్య ధోరణులు ఈ రూపంలో తిరిగి ప్రత్యక్షమౌతున్నాయి. అలీన దేశాల సభ వంటివి ఈ ధోరణులను తీవ్రంగా ప్రతిఘటించాలి. కాని ఒక్క మలేషియా ప్రధాని తప్ప మరెవ్వరూ అమెరికా దుశ్చర్యలను ప్రస్తావించలేక పోయారు. ఆర్థిక అవసరాల కోసం అమెరికా గురించి మాట్లాడడానికే దేశనాయకులు భయపడితే -రేపు నాయకత్వం వహించడానికి వారికి దేశాలే మిగలవు.

-ఆర్. లక్ష్మణరావు

నెల్లూరు.

### అంకయ్యగౌడ్ వివాదం

సారాయి ఉద్యమం విషయంలో శ్రీ రావుల అంకయ్యగౌడ్ జిల్లా

కొరవ 6 పేజీలో

# పాత ధరలకు ఎరువులు

# అమ్మమనిఇప్పుడెవరు చెప్పేది?

ప్రభుత్వం కలోదిది. ప్రభుత్వ చర్యలూ గుడ్డిగా వుంటాయి. తమ పుత్రరువులు, చర్యలు అవకతవకవని ప్రభుత్వానికి తెలియక కాదు; దొంగలు జారుకోవడానికి అవకాశమిచ్చి ప్రజల కండ్లనీళ్ల తుడుపుకు ఇటు వంటి పనులు చేస్తుంటుంది.

అప్పుడు ఎరువుల విషయమే తీసుకోండి; కేంద్ర ప్రభుత్వం ఏ క్షణంలో ఎరువుల సబ్సిడీని ఉపసంహరించిందో, ఆ నిమిషంలో అప్పటికి వ్యాపారస్థుల వద్ద వున్న ఎరువుల స్టాకంతా అంతు చెప్పకుండా చీకటిలోకి పోయింది. దీనివల్ల కొరత ఏర్పడుతుంది; ధరలు పెరుగుతాయి; అప్పుడు క్రమంగా చీకట్లో దాగివున్న ఎరువులన్నీ వెలుగులోకి వచ్చి, లాభసాటిగా అమ్మకమై పోతాయి. ఇది ఈనాడు కొత్త ఆట ఏమీ కాదు. ఒక్క ఎరువులకు సంబంధించిందీ కాదు; అనాదిగా ఏ అత్యవసర వస్తువు మీద కంట్రోళ్లు విధించినా, సడలించినా ఈ చీకటి వ్యాపారం, ధరల పెరుగుదల సజావుగా సాగేదే!

ఎరువులు గాని, మరొకటిగాని, చీకటి లోకి పోయాయంటే పాతాళానికి ప్రయాణించవు; గుంటలు త్రవ్వి పూడ్చిపెట్టరు. లక్షణంగా, భద్రంగా, క్షేమంగా గోడవున్లలోనే వుంటాయి. గోడవున్లనేవి కూడా ఏ అడవిలోనో వుండవు; మన మధ్యనే వుంటాయి. అవి ఎక్కడుండేది, ఏఏ వ్యాపారస్తుని వద్ద ఎంత స్టాకుండేది, అవసరమైతే ఎక్కడ దాచిపెట్టేది అధికార్లకు తెలుసు. ఎరువులైతే ముఖ్యంగా వ్యవసాయ శాఖాధికార్లకు ఖచ్చితంగా తెలిసి తీరుతుంది. వాళ్లవాళ్ల మధ్య ఎన్నో లావాదేవీలుంటాయి కాబట్టి వారు తెలియనట్లు అమాయకంగా వూరు కొంటారు.

> ప్రభుత్వానికి
> చిత్తశుద్ధి
> వుండి వుంటే
> స్టాక్ మాయం
> కాకముందే
> ఉత్తర్వు
> చేసి వుండేది !

ఎరువుల మీద సబ్సిడీలు తొలగించారు; యూరియా వంటి నత్రజని ఎరువుల ధర నామకార్థం తగ్గించారు. ఇది జరిగి పది రోజులై పోయింది. సబ్సిడీలు తొలగించినా, ధరలు తగ్గించినా వ్యాపారుల వద్ద వున్న స్టాకు తెరమరుగై పోతుందనేది ప్రభుత్వానికి తెలుసు. చిల్లర వ్యాపారులే కాదు, హోల్ సేల్ డీలర్లు కూడా రాత్రికి రాత్రి వున్న స్టాకును మాయం చేసేస్తారు. ఒకటి రెండు రోజులు కొద్దిగా పాత ధరలకు ఇస్తారు; తర్వాత స్టాకు లేదంటారు. ఎక్కువ ధర ఇవ్వడానికి సిద్ధపడితే, లేని స్టాకు రెప్పపాటులో ప్రత్యక్షమవుతుంది! ఇప్పుడు ఎరువులకు సంబంధించి ఇదే జరిగింది. పది రోజుల నాడు కేంద్రం సబ్సిడీలు తొలగిస్తే, దాన్ని వ్యతిరేకిస్తూ, ధరలు పెరిగిపోతాయని, వున్న స్టాకు అంతర్థాన మవుతుందని ప్రతిపక్షాలే కాదు, అన్ని పక్షాలూ, అందరు నాయకులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఆ ఆందోళన ఇంకా కొన సాగుతూనే వుంది. కాని వీరి ప్రకటనలు, హెచ్చరికలు, నిరసనలు, వ్యతిరేకతలు అరణ్య రోదన లయ్యాయి; నిష్ఫల మయ్యాయి.

అది పోనీండి. కేంద్రం ఒక నిర్ణయం తీసుకున్నది; పి.వి. ఆర్థిక విధానాలకు తిరుగులేదు. మంచో చెడో నెహ్రూ ఆర్థిక విధానాలు ఒక్కొదానికి క్రమంగా తిలోదకాలివ్వ బడుతున్నాయి. అందులో ఒకటి ఈ ఎరువుల సబ్సిడీ రద్దు. దీనికి రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత లేదు. కాని రాష్ట్ర ప్రభుత్వం చేయగలిగింది, చేయవలసింది ఒకటుంది. ఎప్పుడైతే కేంద్రం ఎరువుల మీద సబ్సిడీలను రద్దు చేసిందో, ఆ క్షణంలో రాష్ట్రంలోని ఎరువుల వ్యాపారుల వద్ద వున్న స్టాకును లెక్క తీయించ వలసింది; అవసరమైతే స్వాధీనం చేసుకొని ఆ స్టాకు అయిపోయ్యే వరకు అధికార్ల పర్యవేక్షణలో పాత ధరలకు అమ్మించ వలసింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ

కొరవ 8 పేజీలో





* అవినీతి వార్తలు నిషేధిస్తే యువతరం బాగు పడుతుంది!

* కాంగ్రెస్ జెండా దుర్గతి

సెక్స్ హింసలను ఒకే గాట కట్టి దుమ్మెత్తి పోయడం అన్యాయమని సెక్సాలజిస్టు డాక్టర్ ఐ. రాజగోపాలరెడ్డి ప్రచారం ప్రారంభించ నున్నారు. సినిమాలలో సెక్స్‌ను చూపడం తప్పుకాదన్నది ఆయన వాదన. సెక్స్ సన్నివేశాల నిషేధ ప్రయత్నం మానమని సెన్సార్ బోర్డుకు జాబులు వ్రాస్తున్నారు. రాజగోపాలరెడ్డి వాదంలో తర్కం వుంది. సెక్స్ అంటే — రెండు మనసులలోని ప్రేమానురాగ భావాల్ని రెండు శరీరాల స్పర్శ ద్వారా వ్యక్తం చేయడం. హింస అంటే రెండు లేదా అంత కంటే ఎక్కువ మనసులలోని క్రోధం, ద్వేషం, ప్రతీకారేచ్ఛలను క్రూరంగా ప్రదర్శించి చూపడం. అటువంటప్పుడు ప్రేమను, క్రౌర్యాన్ని ఒకే గాట కట్టి విమర్శించడం అన్యాయం కాదా అంటున్నారు డాక్టరు గారు.

సెక్స్ ప్రక్రియలు సినిమాల్లో చూసి జనం చెడిపోతారన్న వాదనతో సైతం ఆయన విభేదిస్తున్నారు. ఊరకే, ఆషామాషీగా ఈ వాదం విన్పించడం లేదు. చాలా వివరాలే సేకరించారు. డెన్మార్క్‌లో ఆ దేశ ప్రభుత్వం — సెన్సార్ దృశ్యాలు, శృంగార పత్రికలు, బూతు పోస్టర్లు, బ్లూఫిలింలు వగైరాల వల్ల సమాజంపై చెప్పుకోదగిన ప్రభావమేదీ లేదని భావించి, వాటన్నింటినీ స్వేచ్ఛగా కొనసాగించు కోవచ్చునని ప్రకటించిందట. అమెరికాలో ఒక సంస్థ, సామాజిక జీవనంపై సెక్స్, సినిమాలు తదితరాల ప్రభావంపై అధ్యయనం జరిపి, పెరిగి పోతున్న క్రైం ధోరణులకు, విచ్చలవిడి తనానికి వీటికీ సంబంధమే లేదని తేల్చి చెప్పిందట. పురాణ కాలం నుంచి రతి క్రీడలలోని వివిధ భంగిమలను విపులంగా వ్యక్తీకరించే బొమ్మలను దేవాలయాలపై ప్రతిష్ఠించే సాంప్రదాయం వున్న మన దేశంలో తెరపై సెక్స్ భంగిమలు చూపితే నష్టమేమి టన్నది ఆయన ప్రశ్న.

ఈ వాదం లోతు పాతులలోకి నేను పోదలచడం లేదు. ఆయన నాకు చెప్పింది, నేను చెప్తున్నా అంతే!

* * *

## డోలేంద్ర

ఈ వాదం వింటూంటే నాకొక ఐడియా తట్తోంది!

ఏమిటది?

సినిమాలు చూస్తే, పత్రికల్లో బూతు కథలు చదివితే జనం చెడిపోతున్నారని కదా ప్రభుత్వ నిశ్చితాభిప్రాయం!

అవును!

అంటే, సినిమాలు, పత్రికల్లో వచ్చే ప్రతి చెత్త ప్రచార ప్రభావమూ ప్రజలపై పడుతుందనే కదా దాని భావం!

అంతే కదా?

కొరవ 9 పేజీలో

# మునిసిపాలిటీని ముఖ్యమంత్రే కాపాడాలి!

నెల్లూరు మునిసిపాలిటీ ఆర్థిక పరిస్థితిపై అర్జెంట్‌గా ఏదో ఒక చర్య చేపట్టక పోతే, టౌన్‌లో జన జీవనం దుర్భరమై పోతుంది. దారుణంగా తయారౌతుంది! ఐదేళ్ల తెలుగుదేశం కౌన్సిల్ పరిపాలన టౌన్‌కు ఎంతటి అపకారం చేసిందో, పౌర జీవితంపై ఎంతటి దుష్ప్రభావం చూపిందో, తెలుసుకోవడానికి ఇప్పటి మునిసిపల్ ఖజానా దివాలా స్థితే చాలు!

> “జీతాలకు డబ్బులేని దివాలా స్థితికి చేరుకుంది నెల్లూరు మునిసిపాలిటీ”

మునిసిపాలిటీలో ఇప్పుడు దేనికీ డబ్బులేదు. బొక్కసం మొత్తం ఖాళీ! రెండే పన్నులు జీతాలకు కూడా చాలడం లేదు. కమీషనరుతో సహా సిబ్బంది సమస్తానికి చేయడానికి పనిలేదు; గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడం తప్ప వారు చేయగల్గింది ఏమీ లేదు. వీధి దీపాలు కాలిపోతే మార్చేందుకు బల్బులు కొనుక్కోవడానికి డబ్బులేదు. మూడు నెలల నుంచి కొత్త స్టాక్ రావడం లేదట. ఫలితంగా టౌన్‌లో సగభాగం చీకటి మయంగా వుంది. ట్రంకురోడ్డుపై కూడా దీపాలు వెలగడం లేదు. శివారు ప్రాంతాలలోని కాలనీల సంగతి చెప్పబని లేదు. సాయంత్రమైతే గాఢాంధకారంలో మునిగిపోతున్నాయవి. దొంగలకు మాత్రం మహా సౌకర్యంగా వుంది. పాత రోజుల్లో అమావాస్య ముందు, వెనుక దొంగతనాలు ఎక్కువగా జరిగేవట— చీకట్లో సులభంగా తప్పించుకొనే వీలుంటుంది కాబట్టి! ఇప్పుడా సమస్య లేదు, టౌన్‌లో ప్రతిరాత్రి నిశిరాత్రే!

రోడ్ల పరిస్థితి చెప్పనలివి కాదు. జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిత్వం పుణ్యమా అని ఆత్మకూరు బస్టాండు నుంచి అయ్యప్ప దేవాలయం వరకు ట్రంకురోడ్డును అందంగా తీర్చి దిద్దారు. కాని ఏమి ప్రయోజనం? టౌన్‌లో ఏ చిన్న సభ జరిగినా ఈ దారి పొడవునా స్వాగత ద్వారాలు, కటౌట్లు నిర్మించి, రోడ్డు మొత్తం త్రవ్వేసారేశారు. ఆ గుంటల్లో వానకు నీళ్లు నిల్చి, పెచ్చులు పెచ్చులుగా తారు, కంకర లేచి పోతున్నాయి పెళ్లిళ్ల, పబ్బాలకు కూడా చపకలు నాటి, లైట్లతో అలంకరించడం ఫ్యాషనై పోయింది. రమేష్ రెడ్డి వేసిన సిమెంట్ రోడ్లన్నీ ఆ చపకలు నాటడానికి కొట్టే గుంటలకు పగిలిపోతున్నాయి. టెలిఫోన్ల శాఖ, డ్రైనేజ్ విభాగం, కుళాయిల పనివారు ఎవరిష్టం వచ్చినట్లు వారుగా రోడ్లు త్రవ్వి పారేస్తున్నారు. ఒక్క గుంటనూ పూడ్చే పరిస్థితిలో మునిసిపాలిటీ లేదు. మరొక ఏడాది ఇట్లే గడిస్తే, టౌన్‌లో రోడ్లు పల్లెటూళ్ల డొంకల కంటే హీనంగా తయారుకావడం ఖాయం.

దోమల బాధ చెప్పనలివి కానిది. మునిసిపల్ మురుగు తిని, తిని అవి

> “లైట్లు వెలగవు, గుంటలు పూడవు, చెత్త ఎత్తరు, దోమల బాధ అపరిమితం.. వెరసి పౌర జీవితం దుర్భరం”

బొద్దింకల సైజులో తయారౌతున్నాయి. జెట్‌లు, టార్టాయిస్‌లు, ఫ్యాన్లు, గిన్లు ఏవీ పని చేయడం లేదు. సాయంత్రమౌతున్న దంటే భయమేస్తున్నది. లక్షలు, కోట్ల సంఖ్యలో మిడతల దండులాగా ఇళ్లపైకి దాడిచేస్తున్నాయి. పీకిపీకి వదలి పెడ్తున్నాయి. కంటినిండా నిద్ర కరువై పోయింది. ఒళ్లంతా దద్దులు. మలేరియా జ్వరంలేని ఇల్లు టౌన్‌లో లేదంటే అతిశయోక్తి కాదు. టౌన్‌లో కొత్తగా ఏర్పడిన కాలనీలు వేటిలో సైడుకాలువలు లేవు. ప్రతి ఇంటి ముందూ ఒక మురుగు గుంట తప్పడం లేదు. అవి దోమలకు నిత్య ప్రసూతి కేంద్రాలుగా ఉపకరిస్తున్నాయి. ఆ గుంటలపై వాలుగు మక్కల మందు స్ప్రే చేయడానికి గతి లేదు. అడిగితే మందుకొనడానికి నిధులు లేవట.

టౌన్‌లో చెత్తతొట్లు శుభ్రంచేసే పని మానుకున్నారా అన్పిస్తోంది. వారానికొకసారి కూడా ట్రాక్టరు కన్పడడం లేదు కొన్ని ప్రాంతాలలో! చిన్నచిన్న హోటళ్లున్న చోట ఎంగిలాకులు, ఇతర చెత్త పందుల పుణ్యమా అని రోడ్డంతా పరుచుకొని పోయి, భరించరాని దుర్వాసన వెదజల్లుతున్నది!

ఇంత దారుణమైన పరిస్థితి ఎప్పుడూ లేదు. నెల్లూరు మునిసిపాలిటీలో పలుమార్లు ఆర్థిక సంక్షోభాలు తలెత్తాయి గాని, ఇంతగా ముందమోసిన పరిస్థితి ఇది వరకు లేదు. కౌన్సిల్ పరిపాలనలో నిధుల ఖర్చుకు ఒక పద్ధతి, ప్రణాళిక లేకపోవడమే దీనికి కారణం. ఆ ఐదేళ్ల కాలంలో ఇబ్బడి, ముబ్బడిగా నిధులొచ్చాయి. ఇళ్ల పన్నులు ఒక్కసారి వసూలు కావడం, గ్రామీణ క్రాంతి పథం, తుఫాను నిధులు రావడం, ఎన్టీఆర్ ప్రత్యేక నిధులు కేటాయించడంతో తొలి మూడేళ్లు మునిసిపాలిటీ ఖజానా నిండుగా వుండింది. ఆ డబ్బు టౌన్ అవసరాలను గమనించి, ఒక ప్రణాళిక ప్రకారం పనులు చేపట్టి వుంటే టౌన్ సమస్యలు చాలా వరకు తీరి వుండేవి. కాని, నిధులను వార్డు కౌన్సిలర్ల

> “ముఖ్యమంత్రి మంచి మనసు చేసుకొని నిధులు పంపితే తప్ప ఈ దుస్థితి తొలగదు!”

ఇష్టానుసారం పంపకం చేయడం వల్ల పాత టౌన్‌లో సిమెంట్ రోడ్లు ఏర్పడితే, కొత్త టౌన్‌కు కనీసం మట్టి రోడ్లుకూ గతి లేకుండా పోయింది. శాశ్వతంగా ఉపకరించే డ్రైనేజీ నీటి పథకాలు, పార్కులు వంటివి అసలే లేకుండా పోయాయి. ఖజానా ఖాళీ అయినా, సమస్యలు మాత్రం అట్లనే వుండిపోయాయి.

కొరవ 8 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు
## విలేఖరుడు

### పరిశీలకుల దగ్గర నెల్లూరు ఎమ్మెల్యేలు

హైదరాబాదులో మకాం జేసివున్న కాంగ్రెస్ పరిశీలకుల విచారణలో నెల్లూరు ఎమ్మెల్యేలందరూ – షరా మామూలుగా ఒక్క శీనయ్య తప్ప – జనార్దన రెడ్డికి తమ మద్దతు ప్రకటించారు. ముందు, అందరూ కలిసి ఒక్కసారిగా వెళ్లి ముఖ్యమంత్రి తరఫున మాట్లాడి రావాలని భావించారట. యానాది రెడ్డి గారు దానికి బ్రేక్ వేశారు. దానితో యానాది రెడ్డి, విష్ణువర్ధన్ రెడ్డి; సుందర రామిరెడ్డి, వెంకటరత్నం నాయుడు; వసల పెంచలయ్య, వక్రా ప్రకాశ రావులు జంటలు జంటలుగా వెళ్లి వచ్చారు. శేఖరెడ్డి కొందరు స్వతంత్రులతో కలిసి హాజరైనారు. జానకిరాం, శివశేషారెడ్డి మాత్రం విడివిడిగా తమ వాదం వినిపించారు. యానాది రెడ్డి గారు, పరిశీలకులు రావడం పట్లనే అభ్యంతరం చెప్పారట. కొంత ఘాటుగానే మాట్లాడినట్లున్నారు.

### వివాదంలో పడిన సారాయి వేలం

జిల్లాలో సారాయంగళ్ల వేలం పాట 11 తేది నుంచి జరుగనున్నది. వేలం జరిపించడానికి కలెక్టరాది అధికారులు ఎంత పట్టుదలగా ప్రయత్నిస్తున్నారో, సారా వ్యతిరేకోద్యమ నాయకులూ అంతే పంతంతో ఆటంకాలు కల్పించడానికి పథకాలు రచిస్తున్నారు. ఆ రోజు పెద్ద ప్రదర్శన, మానవహారం నిర్మాణం జరుపగోతున్నారు. ఇంకొక ప్రక్క కాంట్రాక్టర్లూ అయోమయం సృష్టిస్తున్నారు. కలెక్టర్‌పై క్రోధం వెలిబుచ్చుతూ అంకయ్య గౌడ్‌గారు ఈ రోజు పత్రికా ప్రకటన చేశారు. వేలం జరగనివ్వమని ప్రతిజ్ఞ చేశారు. ఇతర కాంట్రాక్టర్లూ వేలం పాడి, అంగళ్లు తెరవలేకుంటే నష్టపోవలసి వస్తుందన్న, భయ సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. ఇతర జిల్లాల కాంట్రాక్టర్లనూ పాటలో పాల్గొననివ్వ కుండా చేయాలన్నది వారి ఆలోచన.

చివరకీ వివాదం, కాంట్రాక్టర్లు అంగళ్లను చవకగా తన్నుక పోయేందుకు ఉపకరిస్తుందేమో!

### లాటరీలపై స్టే

నెల్లూరులో లాటరి అంగళ్లను నడుపుకోవడం పై పోలీసులు ఎటువంటి ఆటంకాలూ కల్పించకూడదని, కేసులు పెట్టరాదని హై కోర్టు ఉత్తర్వు చేసింది.

తాజాగా లాటరీ పిచ్చికి మరొక యువకుడు బలై పోయాడు. నవాబుపేటకు చెందిన ఒక జీపు డ్రైవరు, తన యజమాని రిపేరుకని ఇచ్చిన రెండు వేలూ లాటరి టికెట్లపై వాడి, సర్వం పోగొట్టుకొని, ఆత్మహత్య చేసుకున్నాడట. ఈ మహమ్మారి ఇంకెందరి ప్రాణాలు బలి తీసుకోనుందో!

### నిర్మల రియల్ ఎస్టేట్

'నిర్మల రియల్ ఎస్టేట్స్' పేరిట నెల్లూరులో ఒక నూతన ఇళ్ల స్థలాల కంపెనీ ప్రారంభమైంది. నిర్మల కాఫీ రామస్వామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ శ్రీ వై.సి. రంగారెడ్డి కుమారులిద్దరూ కలిసి ఈ సంస్థను ప్రారంభించారు. 30 తేది డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి దీనికి రిబ్బను కత్తిరించారు.

నెల్లూరులో రియల్ ఎస్టేట్లు, ఫైనాన్స్ కంపెనీలు, పుట్టగొడుగుల మాదిరి పుట్టుక వస్తున్నాయి. నిర్మల ఆ కోవకు చెందింది కాదని, కారాదని ఆశిద్దాం!

### మరణాలు

ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి – పద్మనాభ రెడ్డి సోదరి శ్రీమతి సరోజనమ్మ భర్త శ్రీ గండవరపు ఆదినారాయణ రెడ్డి (73) అస్వస్థులుగా వుండి 1 తేది రాత్రి నెల్లూరులో దివంగతులైనారు. వారి స్వగ్రామం మోదెగుంట. ఆయన ఏకైక సంతానం శ్రీ జి. మధుసూదన రెడ్డి వద్దనే వుండినారు.

నిరవకాశిని పసిరిక పాముతో పోలుస్తుంటారు. ఆదినారాయణ రెడ్డి అంత శాంత, సాధుస్వభావుడు; వున్న చోటు తెలియని వ్యక్తి. 2 తేది ఆయన అంత్యక్రియలకు జనార్దన రెడ్డి రాలేకపోయాడు. శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ, పద్మనాభరెడ్డి వచ్చారు.

* * *

బంగారు నగల వ్యాపారంలో ఆనాదిగా పేరు ప్రఖ్యాతులున్న గుండాల సోదర జ్యేష్ఠుడు శ్రీ గుండాల వెంకట సుబ్బారెడ్డి (బుజ్జిరెడ్డి) గుండెపోటుతో 28 తేది మద్రాసులో మరణించారు. ఆయన వయస్సు 72 సంవత్సరాలు. మరు రోజు నెల్లూరులో అంత్యక్రియలు జరిగాయి. ఆయనకు నలుగురు కుమారులు, ఒక కుమార్తె వున్నారు.

బుజ్జిరెడ్డి మునిసిపల్ కౌన్సిలర్‌గా తన వార్డు అభివృద్ధికి అంకిత భావంతో కృషి చేసిన వాడు. గిడ్డంగి వీధిలో ఒక ప్రాథమిక పాఠశాలను నెలకొల్పి, దాన్ని పెద్దప్రాథమికోన్నత పాఠశాలగా అశాలగా అభివృద్ధిజేసి ఎటువంటి గొడవ లేకుండా సమర్థంగా నిర్వహిస్తుండిన వ్యక్తి. వుచితంగా హోమియో వైద్యం చేసే వాడు; వుపకారజీవి. బుజ్జయ్య సంతానానికి ఆయన సోదరులకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

* * *

మద్రాసు – విజయాధిపతి శ్రీ బి. నాగిరెడ్డి గారి ఆఖరు తమ్ముడు, మన శ్రీ దేవళ్ల శేషారెడ్డి వియ్యంకుడు, శాంత సౌజన్య స్వభావి శ్రీ బొమ్మిరెడ్డి రామలింగారెడ్డి (67) గత 23 తేది రెప్పపాటులో కన్నుమూశారు. ఆయనకు ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

* * *

నెల్లూరు వృద్ధ న్యాయవాది శ్రీ కొండూరు సూర్యనారాయణ (75) గత 27 తేది దివంగతులైనారు. ఆయన కొంత కాలంగా హృద్రోగంతో అనారోగ్యంగా వుండినాడట. ఆయనకు ఒక భార్య, ఇద్దరు కుమారులు, కుమార్తె వున్నారు. వారికి మా సానుభూతి.


**– సవరణ –**

జమీన్‌రైతు 28.8.92 తేది పత్రిక 6 పేజీ గుడివాడ సబ్‌కోర్ట్ OS 5/77, EP 16/91 ప్రకటనలో పొరపాటుగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా పటమటకు బదులు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా – విజయవాడ అని ప్రచురించబడినది. గమనించ ప్రార్థన.

జి.ఎస్.ఆర్. ఆంజనేయులు
అడ్వొకేటు – గుడివాడ

**GOOD NEWS FOR NURSES**
*Ministry of Health*
**KINGDOM OF SAUDI ARABIA**

స్టాఫ్ నర్సులు వెంటనే కావలెను

- ☐ సుమారు 20,000/- లు నెలసరి జీతం
- ☐ ఉచిత వసతి & భోజన సదుపాయం
- ☐ సర్టిఫికెట్స్ జెరాక్స్ కాపీలు - 3
- ☐ పాస్‌పోర్ట్ సైజ్ ఫోటోలు - 6

తీసుకొని వారం రోజుల లోపల మమ్ము కలుసు కోవలసింది

**అల్–అరబ్ ట్రావెల్స్**
సి.ఎ.ఎమ్. హై స్కూల్ ఎదురుగా
22/636, మూలపేట – నెల్లూరు - 524 003.
Reg. No. 117/DEL/PER/1000+3/1555/84

**బలాది లేహ్యం**
నరముల బలహీనత గుండె దడ, ఆయాసము, ఇతర ప్రేవరు, మొదలగు వాటిపై పని చేయును. వీర్యశక్తి, రక్త పుష్టి బలము ఉత్సాహమును కలిగించును
200 గ్రాముల సీసా రూ. 40/- మా వద్ద ప్రశస్త ఆయుర్వేద ఔషధములు లభించును.
**జనార్దన ఆయుర్వేద ఫార్మసి**
4/607 ఉస్మాన్ సాహెబ్ పేట,
నెల్లూరు - 524 002

**ఇల్లు అమ్మబడును**
నెల్లూరు మూలపేట రాజాగారి వీధిలో మెయిన్ రోడ్డు వార్డు నెం. 20 డోరు నెం. 62 లో 45 అంకణాల స్థలములో, 35 అంకణాల కట్టుబడిగల మిద్దె యిల్లు అమ్మబడును. సంప్రదించండి
ఓ. అబ్బాయిరెడ్డి.
అడ్వొకేటు, వహాబ్ పేట, నెల్లూరు
ఫోన్: 25133

**అపార్ట్‌మెంట్ అమ్మబడును**
నెల్లూరు టౌన్ బాలాజీనగర్ మొదట్లో సమత అపార్ట్‌మెంట్స్‌లో 12వ నంబరు 2 బెడ్రూమ్ ఫ్లాట్ అమ్మబడును. వివరములకు అదే ఫ్లాట్‌లో శ్రీనాథ రెడ్డి గారిని సంప్రదించండి.


**గూడూరు సబ్ జడ్జి కోర్టులో**

IA 145/1991 in O.S. 90/87

పుల్లూరు సుబ్రహ్మణ్యం –పిటీషనరు

Vs

వయ్యావూరు ఈశ్వరయ్య –రెస్పాండెంటు

వయ్యావూరు ఈశ్వరయ్య
S/o. వెంకటయ్య
కలగంధ గ్రామం & పోస్ట్
వెంకటగిరి మండలం

సదరు నంబరులో దావాను Restore చేయమని కోరుచు పిటీషను దాఖలు చేసినందున యిందు విషయమై నీకు ఆక్షేపణలున్న 1992 సంవత్సరం 9 నెల 11 తేది ఉదయం 10 గంటలకు ఖుద్దున గాని, వకీలు ద్వారాగాని, యీ కోర్టులో హాజరయి కోర్టు వారితో మనవి చేసుకొనవలసినది. లేని యెడల సదరు విషయమై నీ పరోక్షమున విచారించి తీర్మానము చేయుదురని తెలియ చేయడమైనది.

టి. సుధాకరరెడ్డి
Advocate for the Petitioner,
27.8.92 Sullurpet


**రొయ్యల పెంపకానికి పొలం అమ్మకం**
కోడూరుకు దగ్గరలో వున్న రెండు వైపుల ఉప్పునీటి పారుదల సదుపాయం కలిగి, తక్కువ ఖర్చుతో సలువు చెయ్యటానికి వీలైన రొయ్యల పెంపకానికి అనువైన వాగర్త పొలం సుమారు 22ఎకరాలు అమ్మకానికి వున్నది. ఇది మా కుటుంబానికి హక్కు, భుక్తములు కలిగినట్టిది. కావలసిన వారు నన్ను సంప్రదించ వచ్చును.
అన్నదేవుల రామచంద్రారెడ్డి
అడ్వొకేటు, మూలపేట, నెల్లూరు

**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**
నెల్లూరు డివిజన్
సరస్వతి నగర్ – దర్గామిట్ట – నెల్లూరు - 524 003.

(ప్రారంభోత్సవం)

5 సెప్టెంబరు '92 తేది ఉదయం 10.30 గంటలకు
శ్రీ కె.పి. నరసింహన్
ప్రారంభిస్తారు

నెల్లూరు డివిజన్ పరిధిలో నెల్లూరు, చిత్తూరు ప్రకాశం జిల్లాలకు చెందిన 18 బ్రాంచి కార్యాలయాలు పనిచేస్తాయి. ఈ అన్ని శాఖల కార్యకలాపాలను సన్నిహితంగా, సమర్థవంతంగా పర్యవేక్షించే వీలు ఏర్పడుతున్నందు వల్ల గ్రామీణ ప్రాంతాలలోని అధిక సంఖ్యాక ప్రజానీకానికి జీవిత భీమా రక్షణ కల్పించేందుకు, ఖాతాదారులకు మరింత మెరుగైన సేవలందించేందుకు అవకాశం లభిస్తుంది.



– సి.ఎన్. మాధవ రావు
సీనియర్ డివిజనల్ మేనేజరు
ఎల్ఐసి ఆఫ్ ఇండియా, నెల్లూరు

నెల్లూరు, 5.9.92

# వెంకటగిరి జాతర ఎవరు జరుపుతారు?

వెంకటగిరి జాతర వివాదంలో పడిపోయింది. వంద ఏళ్లనాటి ఈ గ్రామోత్సవం రాజకీయాల ఊబిలో చిక్కుకు పోయింది.

కొన్ని తరాల నుంచి వెంకటగిరి పోలేరమ్మ రాజాల ఆశ్రయంలోనే వుండింది. ప్రతి ఏడాదీ వారే జాతర జరిపేవారు. వారే ఖర్చు పెట్టేవారు. రాజరికం పోయిన తర్వాత కూడా అదే పద్ధతి. అయితే ఖర్చుకు కొంతలో కొంత హుండీ ద్వారా లభించేది. అది వారే తీసుకొనేవారు. నగలు, గిగలు వారి దగ్గరే వుండేవి. పోలేరమ్మ పట్ల రాజాలకు భయం, భక్తి రెండూవున్నాయి. ఎందువల్లనో ప్రభుత్వానికి ఈ గుడిపై కన్ను పడింది. రాజాల నుంచి నగలు స్వాధీనం చేసుకోవడానికి ఒకటికి రెండు సార్లు ప్రయత్నించారు. అయితే గ్రామస్థులు అందుకు ఒప్పుకోలేదు. వెంకటగిరీయులకు, పోలేరమ్మకు ఒక అవినాభావ సంబంధముంది. గ్రామదేవత కంటే అధికమైన సెంటిమెంట్ వుంది. రాజాలపై వెంకటగిరీయులకు ఏమాత్రం ప్రేమలేదు. సర్పంచ్ ఎన్నికల్లో పోటీ చేసినా ఓడించారు. కాని జాతర దగ్గర కొచ్చేసరికి ఆ ఆనవాయితీ మారుతున్నదంటే బాధపడ్డారు. ఈ అభ్యంతరాలు ప్రక్కన పెట్టి దేవాదాయ శాఖ పోలేరమ్మ నగలు స్వాధీనం చేసుకొన్నది. నగలైతే తీసుకున్నారు కాని జాతర జరిపేదెట్లా? పోలేరమ్మకు ఆస్తులు లేవు. ఆదాయంలేదు. డిప్యూటీ కమీషనర్ శ్రీ శంకరరెడ్డి ఒక సమావేశం జరిపారు. గ్రామస్థులను పిల్చి విరాళాలిమ్మన్నారు. ఎవరిస్తారు? జాతర నిర్వహణకు ఒక కమిటీ ఏర్పడింది. శ్రీ సతీష్‌చంద్ర దానికి కన్వీనరు. చివరకు శంకరరెడ్డి గారి తోడ్పాటుతో జాతర జరిపించేయాలని ప్రయత్నం. అంతకంటే పెద్దనాయకులాలి నుంచి ఆర్థిక సహాయం వాగ్దానం అందినట్లుంది. ఆఖరకు పోలేరమ్మకూ రాజకీయవాదుల అండ లేనిదే గడవని పరిస్థితి వచ్చిందన్నమాట.


## వివేకా మెడికల్స్

పొగతోట సెంటరు, ట్రంకురోడ్డు
నెల్లూరు. ఫోన్: 27691

### అడ్రసు మార్పు

మా షాపు ప్రస్తుత అడ్రసు నుండి ఎదురుగా శ్రీ రమణ విలాస్ భోజన హోటల్ ప్రక్కకు మార్చబడినది. డోర్ నెం. 16/1295/3 ఖాతాదారులు గమనించ ప్రార్థన.


---

## జనవాణి

3 పేజీ తరువాత

అధికారులపై ప్రత్యక్ష యుద్ధం ప్రకటించడం , ఆయన ప్రకటనలకు అధికారులు సమాధానం చెప్పలేకపోవడం శోచనీయం. సారాయి ఉద్యమం వల్ల అంకయ్యగౌడ్ వంటి కాంట్రాక్టర్లు చాలానే నష్టపోయారు. ఏ వ్యాపారస్తుడికైనా నష్టం వస్తే కష్టమే. మంచిని ఉద్దేశించిన ఒక ఉద్యమం వల్ల కొందరు వ్యక్తులు నష్టపోతే, పరిహారం చెల్లించడం, లేదా ఆ నష్టాన్ని తగ్గించడం ప్రభుత్వ కర్తవ్యం. ప్రభుత్వమంటే జమ, ఖర్చు, చూసుకొనే వ్యాపార సంస్థకాదు. ఉద్యమం ఎవరు నడిపినా, సారాయి అంగళ్ల మూత ప్రజల శ్రేయస్సు కోసమే అయినపుడు, వాటిని బలవంతంగా తెరిపించి, అమ్మించడానికి ప్రభుత్వం ఎందుకు ప్రయత్నించాలి? ప్రభుత్వానికి సారాయి ఆదాయం ముఖ్యమా, ప్రజల ఆరోగ్యం ముఖ్యమా? ఉద్యమం తాత్కాలికమైనా సరే. ప్రజలు పదిరోజులు తమ గ్రామంలో సారాయి అంగడి పెట్టవద్దని చెప్పినా సరే ప్రభుత్వం ఆనందపడాలి తప్ప, ఆర్జన తగ్గుతుందని బాధపడితే అది ప్రభుత్వమేకాదు.

అంకయ్యగౌడ్ అసలు కోపం తన కాపురు సారా కేంద్రాలపై ఎక్సైజ్ అధికార్లు దాడి చేయడమేనని తెలిసిందే. ఆ కేంద్రాలను ప్రోత్సహించింది అదే అధికారులు. మామూళ్లలో తేడాలొచ్చి మెషిన్లు పట్టుకోవడం తప్ప కాపురు సారా మాన్పించాలన్న మంచి బుద్ధి ఎక్సైజ్ అధికార్లకు లేదు. అదే వుంటే ఒక్క అంకయ్యగౌడ్ మీద మాత్రం ఎందుకు దాడి చేస్తారు? జిల్లాలో ఇంకెవ్వరూ మెషిన్లు పెట్టి సారా చేయడం లేదా? మద్రాసుకు స్మగ్లింగ్ జరపడం లేదా? ఆ సంగతులు అధికార్లకు తెలియవా?

కుళ్ళిపోయిన వ్యవస్థ మనది. ఇందులో ఎవరూ పవిత్రులుకారు, కొందరే పతితులు కాబోరు. ఎక్సైజ్ వంటి అవినీతి కూపాలలో ప్రజల రక్తమాంసాలు పీల్చి బ్రతికే అధికారులున్నంత కాలం అంకయ్యగౌడ్ వంటివారు అధికారులను పబ్లిక్‌గా తిట్టి, పెద్ద మనుషులుగా చలామణీ కాగల్గుతారు. ఈ విషయంలో అంకయ్యగౌడ్‌ను తప్పుపట్టే కంటే, ఎక్సైజ్ అధికారులను నిలదీయడం ఉచితం.

-ఎం.మధుసూదనరెడ్డి

---


## బాడుగకు ఇవ్వబడును

నెల్లూరు ట్రంకురోడ్ వి.ఆర్. కాలేజి ఎదురుగా వున్న సి.ఎస్.సి. కాంప్లెక్స్‌లో క్రింద 4 నెంబరు కొట్టు ఒకటి బాడుగకు ఇవ్వబడును. మరియు అదే కాంప్లెక్స్‌లో మిద్దె మీద సుమారు 200 చ.అ. కొట్టు, సుమారు 500 చ.అ. హాలు 4 రూములు కలిపి బాడుగకు యివ్వబడును.

చిన్ని శ్రీనివాసులశెట్టి జ్యూయలర్స్
ప్రొ. చిన్ని వెంకట సుబ్బారావు
13/98, మండపాల వీధి.
నెల్లూరు - 524 001 Ph: 23948, 29838

శ్రీ చందన మెడికల్ అండ్ ఫ్యాన్సీ
16/481, పొగతోట,
నెల్లూరు Ph: 24051


## రాజేశ్వరరావు

మొదటి పేజీ తరువాత

మొత్తం అనుకూల మౌతుందన్న అభిప్రాయంతో ముఖ్య మంత్రికి హితుడైన ఒక ఉభయ మిత్రుడు ఇద్దరి మధ్య సయోధ్యకు ప్రయత్నాలు జరుపుతున్నారు. ప్రధాని పట్ల ముఖ్యమంత్రి అంత ఒద్దికగా మసలు"న్నపుడు, ప్రధాని శ్రేయోభిలాషిగా వుండవలసిన మనం పార్టీలో సంక్షోభం సృష్టించడం ధర్మంకాదనే వాదంతో, వ్యక్తిగత కారణాల వల్ల ప్రజలలో పార్టీ చులకనై పోతున్నదనే వాస్తవం గ్రహింపుతో అందరూ కలిసి పోవడం మంచిదని రాజేశ్వరరావుకు నచ్చచెప్తున్నారు. ఆయన కొంత మెత్తపడినట్లే కన్పిస్తున్నారు. ప్రధాని విదేశాల నుంచి తిరిగి వచ్చిన తర్వాత, ఆయన మూడ్ కనిపెట్టి, ఏ విషయం తేల్చి చెప్పాలనే ఆలోచనలో వున్నట్లున్నాడాయన.

## పరిశీలకులు

మొదటి పేజీ తరువాత

వారూ ముఖ్యమంత్రికి అనుకూలం గానే మట్లాడారు. నాయకత్వం మారదని పరిశీలకులు పత్రికా ప్రకటన చేయడంతో పాటు, ఎమ్మెల్యేలు జనార్ధనరెడ్డి పక్షం మాట్లాడడంతో అసమ్మతీయులకు మొదట వున్న ఉత్సాహం నీరు గారిపోయింది.

పరిశీలకుల దగ్గర ప్రముఖంగా ప్రస్తావనకు వచ్చిన అంశాలలో చెన్నారెడ్డి రంగ ప్రవేశం ఒకటి కావడం గమనార్హం. గవర్నరుగా వుండి కూడా ఆయన చీటికి మాటికి హైదరాబాదు వచ్చి రాష్ట్ర రాజకీయాలలో వేలు పెట్టడం పట్ల పలువురు ఎమ్మెల్యేలు అభ్యంతరం చెప్పారు.

పరిశీలకులలో జితేంద్ర ప్రసాద్ మాత్రం 3తేది రాత్రి ఢిల్లీవెళ్లిపోయారు. మోతీలాల్ ఓరా, ప్రతిభాపాటిల్,భువనేష్ చతుర్వేది బహుశా ఈరోజు (4తేది) తిరిగి వెళ్లవచ్చు. జితేంద్ర ప్రసాద్ ఇక్కడున్న మూడురోజులలో ఒకరోజు తిరుపతి వెళ్లి వెంకటేశ్వర స్వామి దర్శనం చేసుకొని వచ్చారు.



వెంకటగిరి నిమ్మ పరిశోధనా కేంద్రంలో డిఆర్‌డిఎ ప్రాజెక్ట్ డైరక్టర్ సతీష్ చంద్ర, వ్యవసాయ శాస్త్రవేత్తలు రాజేంద్రప్రసాద్, డాక్టర్ ఈశ్వరరెడ్డి, డాక్టర్ వెంకటేశ్వరరెడ్డి


## హేమలత గార్మెంట్స్ ఫోన్: 23443

షెడ్ నెం 5 ఫేస్ - I, ఆటోనగరు – నెల్లూరు - 524 004.

దిగువ ఖాళీలకు వయస్సులో చదువుతో నిమిత్తము లేని అభ్యర్థుల నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. వికలాంగులకు వితంతువులకు ప్రత్యేకత కలదు. దరఖాస్తు ఫారములు కావలసిన వారు రూ. 10/- మనియార్డరు ద్వారా లేదా స్వయముగా చెల్లించి పొందవచ్చును. పూర్తి చేసిన దరఖాస్తులు స్వీకరించుటకు ఆఖరి తేది 26.09.92

ESI, PF మరియు బోనస్ సౌకర్యాలు కలవు.

| కేటగిరి | ఖాళీల సంఖ్య | జీతం | వివరములు |
|---|---|---|---|
| టైలర్స్ | 45 | రూ. 700-1000 | స్త్రీలకు మాత్రమే 1 సంవత్సరము ట్రయినింగు కలదు. ట్రయినింగులో నెలకు రూ. 300 స్టయిపెండ్ ఇవ్వబడును. హాస్టలు వసతి కలదు. |
| సూపర్‌వైజర్స్ | 6 | 1000-1240 | ఎక్స్‌పోర్టు పనిలో ఎక్కువ అనుభవమున్న వారికి ప్రత్యేకత |
| క్లర్కులు | 2 | 650-830 | ఇంటర్ పాస్ కైవాలని వుండాలి |
| సెక్యూరిటీ గార్డు | 2 | " | Ex-serviceవాళ్ళకు ప్రత్యేకత కలదు. |
| మేట్రన్ | 1 | 1000-1240 | House Mother training పొంది ఉండవలయును. స్త్రీలకు మాత్రమే |
| కుక్ | 1 | 500-650 | వంటలో అనుభవమున్న వారికి ప్రాధాన్యత |
| మేనేజరు | 1 | 1200-1500 | డిగ్రీ కల్గి ఫ్యాక్టరీ మెయినటెన్స్‌లో అనుభవము కలిగి వుండాలి. |

సి.హెచ్. హేమలత, ప్రొప్రైటర్

## అపోలో హాస్పిటల్ / నెల్లూరు



ప్రఖ్యాత కార్డియాలజీ కన్సల్టెంట్ డా. సంజీవ కుమార్ అగర్వాల్ డి.యం. గారితో అపోలో హాస్పిటల్, నెల్లూరు నందు మొట్టమొదటి సారిగా "24" గంటలు "పేస్ మేకింగ్" సౌకర్యం.

* 24 గంటల కార్డియాక్ కేర్ సెంటర్

అన్ని రకముల, అత్యవసర హృద్రోగ చికిత్సలకుమరియు కంప్యూటరైజ్డ్ స్ట్రెస్ అనాలసిస్, ఇకో కార్డియో గ్రాఫ్ మరియు ఐ.సి.సి.యు విభాగములు కలవు.

ప్రఖ్యాత న్యూరాలజిస్ట్ డా. రత్నవల్లి డి.ఎం. (న్యూరాలజీ)
అపోలో హాస్పిటల్స్, హైదరాబాద్ వారు ప్రతి శనివారము మా హాస్పిటల్ నందు సంప్రదింపులకు లభించెదరు.

గమనిక: ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకున్న వారికి ప్రాధాన్యత ఇవ్వబడును.

## ప్లాటు కొనండి! డిస్కౌంటు పొందండి!!

నెల్లూరు టౌన్‌లోని మా కాలనీలలో నివాస యోగ్యమైన క్రింది స్థలములను సరసమైన ధరలకు

10% డిస్కౌంటుతో పొందండి

- మూలాపేట ధర్మరాజస్వామి దేవాలయమునకు ఆనుకొని యున్న శివగిరి కాలనీ యందు
- వేదాయపాళెం రత్నగిరి కాలనీ యందు
- వెంకటాచలం దగ్గరలోని జి.యన్.టి. రోడ్ ఆనుకొని యున్న శైలగిరి కాలనీ (ప్లాటు ఖరీదు కేవలం రూ.[illegible]6,000/- మాత్రమే)
- కాకుటూరు విష్ణుగిరి కాలనీ యందు
- ఆటోనగర్‌కు ఆనుకొని యున్న తల్పగిరి కాలనీ యందు

ప్లాటు ధరలో నాలుగవ వంతు సైకము చెల్లించి మిగిలిన సైకము 12 వాయిదాలలో చెల్లించు అవకాశము 6-10-92 వరకు మాత్రమే.

ఈ సదవకాశం 6-9-92 నుండి 6-10-92 వరకు

గమనిక: ప్రతి ఆదివారము ఉ. 8 గంటలకు స్థల సందర్శనమునకు మా ఆఫీసు నుండి ఉచిత వాహన సౌకర్యము కలదు.

వివరములకు: ప్రమోటర్స్
J.L.నారాయణ అసోసియేట్స్
ట్రంకురోడ్డు, నెల్లూరు - 1 ఫోన్: 26729

కొత్త నిర్మాతలు తెస్తున్న చేటు!

# తెలుగు సినిమా రంగంలో మళ్లీ స్లంప్!

జనవరి నుంచి జూలై వరకు 60 చిత్రాలు విడుదలవగా 12 మాత్రమే హిట్ చిత్రాలు కాగలిగాయి. "చినరాయుడు" "వంటి చిత్రాలు దెబ్బతినడంతో కొనుగోలుదార్లు ఎంతగానో నష్టపోయి, వెనక్కి వెళ్లిపోతున్నారు. కొత్త చిత్రాలు కొనడానికి ఎవరూ సాహసించలేక పోతున్నారు. మరో వంక చిత్ర నిర్మాణవ్యయం హద్దుమీరి పెరిగి పోతోంది. చిత్రాలు తగు సంఖ్యలో విజయవంతం కాక పోవడం వల్ల థియేటర్ల వారికి కూడా స్లంప్ రాబోతుంది. అసలు క్రమక్రమంగా చిత్ర పరిశ్రమ మొత్తం మళ్ళీ స్లంప్‌కి గురి అయ్యే ప్రమాదం కనిపిస్తోంది.

చిత్ర నిర్మాణ వ్యయాన్ని అదుపు చేయడానికి ఎవరూ ప్రయత్నాలు చేయలేక పోతున్నారు. తారలు, సాంకేతిక నిపుణులు తమ పారితోషికాల్ని అంతకంతకు ఎక్కువ చేస్తున్నారు. చిత్రనిర్మాణ సంఖ్య పెరగటం, అనుభవం లేని కొత్త నిర్మాతలు ప్రవేశించడమే అందుకు కారణమన్నది అందరూ ఎరిగిన సత్యమే.

## సెక్స్ హింసలకు బ్రేక్

చలన చిత్రాలలో హింస, సెక్స్‌లను అపరిమితంగా చూపించడాన్ని నిరోధించే బిల్లు ఆగస్టు 18న రాజ్యసభలో ప్రభుత్వం ప్రవేశపెట్టింది. సెన్సార్‌షిప్ మార్గదర్శక సూత్రాలను అతిక్రమించిన వారికి జరిమానా మొత్తాన్ని రెండింతలు గాని, మూడింతలు గాని, చేయాలని, అలాంటి సినిమా ప్రింట్లను స్వాధీనం చేసుకునే అధికారాన్ని సిబిఎఫ్‌సి ప్రాంతీయ అధికారికి అప్పగించాలని ఆ బిల్లులో పేర్కొన్నట్లు సమాచార ప్రచారశాఖ ఉపమంత్రిణి గిరిజావ్యాస్ తెలిపారు.

## సంగీత దర్శకుడుగా వంశీ

ఈ రోజుల్లో సంగీత దర్శకుడవ్వాలంటే సంగీతం తెలిసుండక్కర్లేదు - అని వాపోయాడో సంగీత దర్శకుడు. నిజమే. "ఎంకన్నబాబు" చిత్రానికి రచయిత రాజశ్రీ సంగీత దర్శకుడయ్యారు. "జోకర్" చిత్రానికి డైరెక్టర్ వంశీ సంగీత దర్శకుడయ్యారు. ఇందుకు వీళ్లకున్న అర్హతలేమిటంటే, సంగీతం పట్ల అభిరుచి ఉండడమట! ఈ లెక్కన సంగీతాభిరుచి గలవారందరూ సంగీత దర్శకులవ గలరన్న మాట! కొత్త చిత్రనిర్మాతల మూలంగానే ఇలాంటి విడ్డూరాలు, విపరీతాలు జరుగుతున్నాయి.

## తారల ఆధిపత్యం

కొత్త నిర్మాతలంటే ముఖ్యంగా తారలకు అలుసు ఉండడం సహజమే. "నా మొగుడు-నా ఇష్టం" చిత్ర నిర్మాతలు యమునను నాయికగా బుక్ చేశారు. "పాటలు ఎక్కడెక్కడ ఎలా తీస్తున్నారు? అని అడిగి తెలుసుకున్నాక స్టైల్ నాపిడే పెట్టండి," అందట యమున "చూస్తాం" అన్నారు నిర్మాతలు వి.మోహన్‌రావు, మాఘం ప్రసాద్. వీళ్లు మూడు నెలల ముందే యమునకు

కొరవ 9 పేజీలో

# ఇళయరాజా జోరు తగ్గుతూంది!

సంగీత దర్శకుడు ఇళయరాజా కీర్తి, ఐశ్వర్యం మించిపోయేసరికి నియంతగా వ్యవహరించ సాగాడు. ఇప్పుడు అతనికి పోటీగా, తమిళనాడులో ఎందరో కొత్త సంగీత దర్శకులను చాలా మంది నిర్మాతలు పరిచయం చేస్తున్నారు. వీళ్ళల్లో చాలా మంది ఇళయరాజా అసిస్టెంట్లే. ఒకప్పుడు ఇళయరాజా సంగీతంతో ఎన్నో చిత్రాలు తీసిన తమిళ నిర్మాతలే ఇప్పుడు కొత్త సంగీత దర్శకులను నియమించు కుంటున్నారు. దీంతో ఇళయరాజా ఊపుకు కళ్లెం పడింది.

కొత్త సంగీత దర్శకులు కూడా ఇళయరాజాకు ఏమాత్రం తీసిపోకుండా పనితనాన్ని చూపిస్తున్నారు. ఇళయరాజా ప్రతికూల పవనాల ప్రభావం తెలుగు సినిమారంగం మీద కూడా పడింది. ఇది వరకటిలాగా ఇళయరాజాను బుక్ చేసుకోవడానికి ఏ తెలుగు నిర్మాతా అంతగా ఆసక్తి కనబరచడం లేదు. ఇప్పుడిక ఇళయరాజా పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు. పరిస్థితి చేయిదాటి పోయింది!



ఈశ్వర్ చిత్రంలో సాయికుమార్, సీతార

మానవతా దృక్పథాన్ని సున్నితంగా ప్రబోధించే

# అక్క మొగుడు

సినిమా రంగపు చీకటి ప్రాంగణంలో దర్శకుడు క్రాంతికుమార్ ఒక కాంతి కిరణంలా వెలుగొందు తున్నారు. మూస చిత్రాల ధోరణిలా కాకుండా ఆదర్శవంతమైన చిత్రాలు రూపొందిస్తున్నారు. దర్శకుడుగా ఉత్తమ అభిరుచిని అలవరుచుకొని స్త్రీ సమస్యలను ఎన్నుకొని చిత్రాలు తయారు చెయ్యటంలో 'తన ప్రతిభను చాటు కుంటున్నారు. ఈ పర్యాయమూ స్త్రీ సమస్యలను కుటుంబ వ్యవహారాలతో కలగలుపు చేసి 'అక్క మొగుడు' చిత్రం సజీవమైన, సహేతుకమైన శైలిలో అవలీలగా అందంగా మలిచారు.

'అక్క మొగుడు' చిత్రానికి సుజయా మూవీస్ యూనిట్ వారు అల్లిన కథ చాలా చిన్నదే. ఈ చిన్న యితివృత్తాన్ని క్రాంతికుమార్ కథనంలో మంచి ఒడుపుచూపి ప్రేక్షకుల్ని ఒడిసి పట్టుకున్నారు. చిక్కని సన్నివేశాలతో, చక్కని పాత్రలతో"కథను ఉద్రేకంగా నడిపించి ప్రేక్షకులను ఆకట్టుకున్నారు. ఈ చిత్రంలోని వివిధ పాత్రల మనస్తత్వాలు ప్రేక్షకులన్ని స్ఫురింప జేసేంత సన్నిహితంగా ఉండటం ఒక విశేషం. చిత్రం మొత్తం మీద మనకు మానవతా దృక్పథం తటస్థ పడుతుంది.

రాజా (డాక్టర్ రాజశేఖర్) మానవత్వమున్న మంచి మనిషి. ఒక సమయంలో ఒక స్త్రీని రక్షించటంలో అతను ఒక రాక్షసుణ్ణి చంపక తప్పలేదు. ఆ కారణంగా ఆ మంచి మనిషి ఏడు సంవత్సరాల కారాగార శిక్షను భవిస్తాడు. జైలు నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆ మానవతా రూపానికి హంతకుడు అనే ముద్ర వేస్తుంది సమాజం. సమాజాన్ని లెక్క చెయ్యకుండా అతను మంచి పనులు చేస్తూనే వుంటాడు. అతని కారు షెడ్‌కు




ఎదురింటిలో కాపురమున్న గంగ, యమున, సరస్వతి, కృష్ణవేణి, గౌతమి అనే ఐదుగురు అక్కా చెల్లెళ్లు మొదట్లో అతన్ని అసహ్యించు కుంటారు. ఆ తర్వాత గంగ (సుహాసిని) రాజాను ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. ఈ అక్కచెల్లెళ్ల తండ్రి (కోటశ్రీనివాసరావు) ఒక ఉంపుడు గత్తెతో వేరే వుండటం వల్ల, ఈ ఆడపిల్లలు తండ్రిలేని పిల్లలవుతారు. రాజా పట్టుదలతో గంగ నలుగురు చెల్లెళ్లకు గూడా పెళ్లి జరిపిస్తాడు. •

రాజాను ఒక భయంకర వ్యాధి పీడిస్తూవుండేది. చిత్రం చివరన వ్యాధితో రాజా చనిపోతాడు. గంగ నలుగురు చెల్లెళ్ళు రాజాను తమ తండ్రిగా భావించి అతని అంత్యక్రియలు జరిపిస్తారు.

మొదట్లో రాజాను చెడ్డవాణ్ణిగా భావించిన గంగ తన మనసు మార్చుకొని, అతని మీద మనసు పెంచుకునేందుకు ఫ్లాష్ బ్యాక్ చూపిన దృశ్యాలు భాగున్నాయి. అక్షణం నుంచి గంగ రాజుకోసం కలలు కనటం, ఆ కలల కమ్మదనం నిజరూపందాల్చటం, ఆమె అతనిగా వున్నాయి. రాజా, గంగ దంపతులైన తర్వాత వారి జీవితంలో అప్పుడప్పుడూ వెన్నెల వానలు కురిసినా, అక్కడక్కడా విషాదపు ఛాయలు కలవరపెట్టాయి. ఈ దృశ్యాలు గూడా నిండుగా కనిపిస్తాయి.

'అక్క మొగుడు' అనగానే అక్కచెల్లెళ్లు ఏ దిక్కూ లేక అక్క మొగుడు కోసం ఎగబడతారు అనే అభిప్రాయం కూడా ఒకటుంది. అందుకేనేమో ఆ అభిప్రాయంతో కూడు కున్న ఒక సన్నివేశం చూపబడింది. గంగ నలుగురి చెల్లళ్లకు రాజా వివాహ ప్రయత్నాలు చేస్తుంటాడు. అందులో ఒక చెల్లెలు రాజాను పెళ్లి చేసు కుంటానని పట్టుబడుతుంది. అప్పుడు రాజా గంగ ముందే ఆ అమ్మాయికి కొంత మనస్తత్వ శాస్త్రం ఒంపారి పోసి మనసు మారుస్తాడు.

కొరవ 9 పేజీలో

# చిరంజీవి, నిజజీవితంలోనూ ఆపద్బాంధవుడే

కళాతపస్వి కె.విశ్వనాథ్ దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు నిర్మిస్తున్న పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ చిత్రానికి "ఆపద్బాంధవుడు" అని నామకరణం చేశారు. చిరంజీవి, మీనాక్షి శేషాద్రి, శరత్‌బాబు, జంధ్యాల, విజయచందర్, అల్లురామలింగయ్య, బ్రహ్మానందం, ప్రసాద్‌బాబు, నిళల్‌గల్‌రవి, అనంత్, సుబ్బరాజు,గీత, జానకి, నిర్మల,శిల్ప, మాస్టర్ యజ్ఞ వగైరా తారాగణం. మాటలు: జంధ్యాల, సంగీతం: కీరవాణి; ఛాయ: విన్సెంట్; అక్టోబర్‌లో విడుదల.

గుంటూరు బ్రహ్మానంద రెడ్డి స్టేడియంలో "ఘరానా మొగుడు" శత దినోత్సవాన్ని మార్చి 26న చూసివస్తూ అకాల మృత్యువాతపడ్డ ఏటుకూరు గ్రామవాసి అయిన ఆటోరిక్షా డ్రయివర్ తన్నీరు శ్రీనివాసరావు కుటుంబానికి చిరంజీవి యాభైవేల రూపాయలను పంపి ఆదుకోవడంతో నిజమైన ఆపద్బాంధవుడ నిపించుకున్నారు. ఆ వస్తుని మృతుని ఇద్దరు పుత్రికల పేరిట చెరిపదిహేనువేల రూపాయలు, భార్య-కుమారుల పేరిట చెరి పదివేల రూపాయలు ఫిక్సెడ్ డిపాజిట్‌గా ఏర్పాటు చేయడం జరిగింది.

## గాయనిగా సుశీల మేనకోడలు

గాయని సుశీల తన సోదరి పుత్రుడు వి.రామకృష్ణను నేపథ్య గాయకుడుగా పైకి తేవడానికి ఎంతో శ్రమించింది. అతనికి నాలుగైదు చిత్రాలలో మాత్రమే మంచి అవకాశాలొచ్చాయి. ఇప్పుడు సుశీల మేనకోడలు సంధ్యను గాయనిగా రోజా మూవీస్ వారు పరిచయం చేస్తున్నారు. వీరి చిత్రంలో శరత్‌బాబు, ఆమని, రాజేష్, పుండరీకాక్షయ్య, సాయికుమార్, సాగర్, కాంతారావు, అశోక్‌కుమార్, భారతి ప్రభృతులు పాత్రధారులు.

**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100.00 |
| ఆరు నెలలకు | రూ. 50.00 |
| విడి ప్రతి | రూ. 2.00 |



**In the Court of the Additional Subordinate Judge, Chittoor**

O.S.No. 14 of 92

Andhra Bank, Chittoor, rep. byManager, Chittoor. - Plantiff

-Vs-

M. Kandaswamy Udayar - Defendent

**NOTICE**

To
M. Kandaswamy Udayar,
S/o. Margabandhu Udayar
Papisettipalle Village,
Gudipala Mandal
Chittoor Dist - AP
Sir,
Please take notice that the suit filed by the plaintiff against you for the recovery of loan amount, stands posted to 17.9.1992 for your appearance. If you do not appeareitherinpersonorthrough an Advocate, at 10.30 A.M. the matter will be decided exparte.

Sainagar Colony
Chittoor - 517 001.
Dated: 28.8.92

Sd/- **B.V. Vardhana**

Advocate for the Plantiff

**గుడివాడ సబ్‌కోర్టులో/ విజయవాడ సబ్ కోర్టు**

OS 449/482:: EP 20/490

DHR: కెనరా బ్యాంకు గాంధీనగరం, విజయవాడ

JDRs: పొట్లూరి రత్నాకర రావు వగయిరా

ఈ నెంబరులోని 2 వ JDr పొట్లూరి రత్నాకర రావుగారి తాలూకు ఈ దిగువ షెడ్యూలు దాఖలా స్థిరాస్తులు పై కోర్టు వారిచే ఈ డిక్రీ బాకీ క్రిందకు 14.9.92 తేదీన వేలం జరుపబడును. కావున పాటదార్లు వేలం నాడు ఉదయం 10 గంటల నుంచి హాజరై వేలం పాట పాడుకొనవచ్చును.

**షెడ్యూలు**

Situated with in Krishna District Gudivada Sub Registry Saidapudy Village bearing
1. Rs. 38/1 Ac. 0.13 = 0.052 Hectors pura seri Wet Land
2. Rs. 59/1 Ac. 3.40 - 1.774 Hectors out of Ac. 3.54 Seri Wet land bounded in between:
East: The land of Chaparala Satyanarayana; South: The irrigation channel in the land of Chaprala Lakshmamma; West: Irrigation Channel; North: The land in Rs. 38/1 Item 1 mentioned above.

No emcumberances గాన free of encumberances గా వేలం కావలయును.

| DHR's Value | Amin's Value |
|---|---|
| 1. Item: Rs. 130 | Rs. 5200 |
| 2. Item: Rs. 200000Rs | 1,36000.00 |

**A.V. Sivaram**
Advocate for D.H.R.


# శివారెడ్డి పద్యాలు

## పోతన జయంతి

నీ జయంతికెను నెల్లూరు రానేల
అరదాక వచ్చి చూడనేల
కారణమ్ము చెంద కళ్లు లొట్టిబోయాయి
యిల్లు జీరబల్ల మళ్ళి తిరిగి?

బమ్మెర పోతన కవితలు
కమ్మదనమ్ము పాలకోవ కలకండది భా
గ్యమ్ము సరస్వతి ముద్దుల
గుమ్మ స్థిరవరాస్థి ఎన్నో కోట్ల ధనమ్మూ!

అర్థదారిద్ర్యొక్కి అగచాట్లుబడతుండ
కైతలమ్ముకోని కాలక్షేపం
జెయ్యకుండ ఎట్లోజీవించగలిగాదు
బమ్మెర పోతరాజా భాగ్యమేమొ!

ఎన్నిసార్లో చదివ ఎన్నిపర్యాయాలో
విన్న చెవికి అరోక విందునీదు
భాగవతము నీదు భక్తి నీ అనురక్తి
మోక్షమునకు త్రోవ ముందు నావ!

## ఇన్విటేషన్లు

చదువుకోల వేద శాస్త్రాలు వల్లిల
వోనమాలు వచ్చిరానివాణ్ణి
ఎందుకండి యీడికీయిన్విటేషన్లు
కాగితాలు ఖర్చు కవరు వేస్టు!

## డాక్టరు ఉండేల

పద్దినాల్లో అట్టే పైకి రాగలిగావు
అరక్షణంలో డాక్టరైయ్యనావు
నీదు నీతి నిష్ఠ నీనేర్పు నీకూర్పు
క్రొత్తగాదు మాకు కొండారెడ్డి!

## సింహపురి

4 పేజీ కొరవ

ఇప్పుడు నెల్లూరు పౌరులను పురపాలక నరకం నుంచి విముక్తి చేయగల్గిన ఒకే ఒక వ్యక్తి – ముఖ్యమంత్రి మాత్రమే! ఆయనే మంచి మనసు చేసుకొని, నెల్లూరుకు ప్రత్యేక నిధులు మంజూరు చేస్తే తప్ప, ఈ దుస్థితి తొలగదు. ముఖ్యమంత్రిగా స్వంత జిల్లాకు నిధులు తరలించుక పోతున్నాడన్నది పెద్ద విమర్శ కాబోదు. వెంగళరావు గారు ముఖ్యమంత్రిగా ఖమ్మం జిల్లాకు అంత భారీ ఎత్తున నిధులు తరలిస్తే – ఈనాటికీ ఆ జిల్లా వాసులు ఆయన పేరు తల్చుకుంటున్నారు తప్ప, తాత్కాలిక విమర్శలు నిల్వలేదు. ఖమ్మం, కొత్తగూడెం టౌన్‌లలో వెంగళరావు కృషి ప్రతి రంగంలోనూ కన్పడుతుంది. నాగార్జున సాగర్ కాలువ భారీ పరిశ్రమలు, రోడ్లు, పంటకాలువలు, స్కూలు భవనాలు... ఒకటేమిటి స్వంత జిల్లాకు అయిన చేసిన సేవ శాశ్వతంగా నిల్చిపోయింది. జనార్ధన రెడ్డి గారూ అదే కోవలో నెల్లూరు టౌన్‌కు, జిల్లాకు నిధులు తరలిస్తే తాత్కాలికంగా విమర్శలొచ్చినా నెల్లూరు పౌరులు శాశ్వతంగా గుర్తు పెట్టుకొంటారు. నరకయాతనల నుంచి విముక్తులౌతారు.

## రైల్వే వినియోగదారుల సమావేశం

ఆగస్టు26తేది విజయవాడ రైల్వే వినియోగదార్ల సమావేశం రైల్వే డివిజనల్ మేనేజర్ శ్రీ చిదంబరం అధ్యక్షతన జరిగింది. సమావేశంలో నెల్లూరు స్టేషన్‌లో వినియోగదార్లు ఎదుర్కొంటున్న సమస్యల గూర్చి జోనల్ రైల్వే వినియోగదార్ల సలహా సంఘం సభ్యులు శ్రీ ఒమ్మిన సుబ్రహ్మణ్యం ప్రస్తావించారు; వీటిలో కొన్నింటిని తక్షణం పరిష్కరించేందుకు అంగీకారం కుదిరింది. ఒకటవ నెంబరు ప్లాట్‌ఫారం పై షెడ్డువేయడం, స్టేషన్‌లో కూర్చునేందుకు బల్లలు వేయడం, శుభ్రతకు ప్రత్యేకంగా శానిటరీ ఇన్స్‌పెక్టరును నియమించడం, రైళ్లవేళలు ఎప్పటికప్పుడు తెల్సుకొను అదనపు ఫోను పెట్టడంతో పాటు, సామాన్లు తీసుకెళ్లను ట్రాలీలు కొత్తవి కొనడం వగైరాలను సమావేశంలో అంగీకరించారు. ఇవే కాక చాంతాండంత సమస్యల పరిష్కార చిట్టా సమర్పించారు శ్రీ సుబ్రహ్మణ్యం. చెప్పడమే గాక చెయించడంలోనూ ఆయన శ్రద్ధ వహిస్తె ఆనందం.

## సారా ఉద్యమానికి సంతకాల సేకరణ

జిల్లాలో జరుగుతున్న సారా వ్యతిరేక ఉద్యమానికి మద్దతుగా సంతకాల సేకరణ తలపెట్టారు. సారా వ్యతిరేకోద్యమ సమన్వయ సమితి కన్వీనర్ డా. జి. విజయకుమార్ సారా వ్యతిరేక ఉద్యమం జరుగుతున్న గ్రామాల ప్రజలు, తమకు సారా అంగడి వద్దంటూ ఒక అర్జీలో నివేదిస్తూ, దానికి మద్దతుగా వేలాది సంతకాలు సేకరించి పంపమని కోరుతున్నారు. ఈ విధమైన అర్జీలను తమ గ్రామం నుంచి రావాలనుకొనే ఔత్సాహిక ప్రతినిధులకిచ్చి ఈనెల 8వ తేది నెల్లూరులోని కస్తూర్బా కళాక్షేత్రానికి పంపాలని అదే విధంగా 11 తేది జరిగే 'మహా ప్రదర్శన'లో భారీ సంఖ్యలో మహిళలు పాల్గొనాలని కోరారు. జిల్లాలో కొన్ని మండలాల్లోని అధికారులు ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా సారా అంగళ్లు బలవంతంగా తెరిపిస్తూ; అదేమంటే కలెక్టర్ చేయమన్నారన్న తప్పుడు మాటలు చెబుతున్నారని; దీన్ని ప్రజలు ఖండించాలని కోరారు. తమ కమిటీ చేపడుతున్న ఉద్యమానికి అన్ని పార్టీల, వర్గాల ప్రజల మద్దతు ఇవ్వాలని విజ్ఞప్తి చేస్తున్నారు డాక్టర్ విజయకుమార్.

## రాష్ట్రస్థాయి పాటల పోటీలు

సినీ నటుడు అక్కినేని నాగేశ్వరరావు 69వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని సెప్టెంబర్ 20 తేది టౌనహాల్‌లో రాష్ట్రస్థాయి పాటల, ఏక పాత్రాభినయ, రికార్డు డాన్సుపోటీలు నిర్వహిస్తున్నారు. పోటీలో పాల్గొనే వారిని సీనియర్లు జూనియర్లుగా విభజించి బహుమతులిచ్చిస్తారట; ఇతర వివరాలకు ఎన్.ప్రసాద్ కుమార్, సెక్రటరీ, అక్కినేని ఆర్ట్స్, రామలింగాపురం-నెల్లూరును సంప్రదించాలి.

## స్పోర్ట్స్ స్కూలుకు ఎంపిక

ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్స్ స్కూలు ప్రవేశానికి జిల్లా స్థాయిలో విద్యార్థుల ఎంపిక ఆగస్టు 23నుంచి 28వ తేది వరకు జరిగింది. దీనిలో ప్రస్తుతం 4,5,6తరగతులు చదువుతున్న బాల, బాలికలు 12మందిని ఎంపిక చేశారు. మర్చి ఈ నెల 11నుంచి 13వరకు హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగే రాష్ట్రస్థాయి సెలక్షన్‌తో ప్రవేశానికి తుది అర్హులౌతారని ఇన్‌చార్జి కోచ్ శ్రీ డి. రవి ఒక ప్రకటనలో తెలిపారు.

## జాతీయ స్థాయిలో నృత్యపోటీలు

తిరుపతిలోని అకాడమీ ఆఫ్ ఇండియన్ డ్యాన్సెస్ జాతీయ స్థాయిలో కూచిపూడి భరతనాట్యం, జానపద నృత్య పోటీలు నిర్వహిస్తుంది. ఇవి 93జనవరి 10,11 తేదీల్లో జరుగుతాయి. విజేతలకు బంగారు పతకంతో పాటు నృత్యకుమారి' అన్న బిరుదు కూడా ప్రదానం చేస్తామని నిర్వాహకులు ప్రకటించారు. వివరాలకు కార్యదర్శి, అకాడమి ఆఫ్ ఇండియన్ డ్యాన్సెస్, రిజర్వాయర్ రోడ్డు-తిరుపతిని సంప్రదించండి.

## 'వచన కవిత' పోటీలు

వచన కవితా ప్రక్రియకు ఊపిరపోసి, విస్తరింప జేసిన అభ్యుదయ కవి 'కుందుర్తి' ఆంజనేయులు స్మారకంగా జాతీయ స్థాయిలో వచన కవిత పోటీలు జరుగనున్నాయి. హైదరాబాద్‌లోని 'తెలుగు సాహితీ సమితి' వాటిని నిర్వహిస్తుంది. ముప్పై పంక్తులు మించని సామాజిక స్పృహ కలిగిన కవిత వ్రాసి, హామీ పత్రం జతపర్చి కార్యదర్శి, రంజని, తెలుగుసాహితీ సమితి, ఎ.జి.ఆఫీసు-హైదరాబాదు- 500 463కి పంపమని కోరుతున్నారు.

## హాకీ జట్టు ఎంపిక

జిల్లా సబ్ జూనియర్ హాకీ జట్టు ఎంపిక టౌన్‌లోని ఎ.సి.స్టేడియంలో ఆగస్టు 30తేది జరిగింది. ఎంపికకు హాజరైన 57 మంది బాలురలో 25మందిని శిక్షణకు ఎంపిక చేశారు. శిక్షణ పూర్తయిన పిమ్మట తుది జట్టుగా 15మందిని ఎంపిక చేస్తారు. సెలక్షన్ కార్యక్రమంలో సీనియర్ కోచ్ శ్రీ డి.రవి, శ్రీ వై. శేషయ్య, శ్రీ జహీర్ అహమ్మద్ పాల్గొన్నట్లు హాకీ అసోసియేషన్ ఉపాధ్యక్షులుశ్రీ కె. దేవ ప్రసాద్ తెలిపారు.

## ఎరువులు

4 పేజీ కొరవ

విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చలేక పోగా, దంగలు పడిన ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లు, వున్న స్టాకంతా అంతర్ధానమైన తర్వాత, ఇప్పుడు మేలుకొన్నది. 1 తేది వరకు ఎరువుల వ్యాపారుల వద్ద వున్న స్టాకును లెక్కతీసి పాత ధరలకే అమ్మించవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వం కలెక్టర్లను ఆదేశించింది. ఎప్పుడో చెయ్యి దాటి పోయిన వాటిని, ఇప్పుడు పాత ధరలకు అమ్మించడ మేమిటి? ఈ ఆదేశాన్ని కలెక్టర్లు అమలు జరపగలిగేదెంది? రాష్ట్ర ప్రభుత్వపు ఈ ఉత్తరువు హాస్యాస్పదంగా వుంది. పాత స్టాకును పాత ధరలోనే అమ్మించాలనే చిత్తశుద్ధి ప్రభుత్వానికుంటే, సబ్సిడీలు తొలగించిన వుత్తరువుతోటి రాష్ట్ర ప్రభుత్వం ఈ వుత్తరువు కూడా జారీ చేసి వుండవలసింది. అట్లా చేయలేనప్పుడు ఇప్పుడు మిన్నకుండినా బాగుండేది.

ఎరువుల విషయం వ్యవసాయ శాఖకు సంబంధించి పాతధరలకు అమ్మినా, కొత్త ధరలకు, అమ్మినా, వెల్తురులో అమ్మినా చీకటిలో అమ్మినా, అవసరమైనంత స్టాకు వ్యాపారుల వద్ద వున్నా లేక పోయినా, కొరత ఏర్పడినా ఆ బాధ్యతంతా వ్యవసాయ శాఖది. ఈ రోజు కాదు, మొదటి నుండి కూడా ఈ విషయంలో ఆ శాఖ ఘోరంగా విఫలమవుతున్నది. అదే మని అడిగితే మాకు తగినంత సిబ్బంది లేదు అంటారు. మనం ఫలాని వ్యాపారస్తుడు ఎక్కువ ధరకు అమ్ముతున్నాడని ఫిర్యాదు చేసినా అంతగా పట్టించుకోరు. వారి సిబ్బంది నివేదికలు తయారు చేయడానికి, ఖరీఫ్-రబీపథకాలు రచించడానికి, సభలు సమావేశాలకే చాలరు; వాటికి పోను సమయమూ మిగలదు. అదికాక వ్యవసాయ శాఖ కార్యక్రమాల ఖర్చులకు ఎరువుల వ్యాపారస్తులు తప్ప మరో మార్గం లేదు. అటువంటప్పుడు వారి పట్ల అంత నిర్మొగమోటంగా ఎట్లా వ్యవహరించ గలుగుతారు?

విజిలెన్స్ శాఖ వుంది. స్టాకు బ్లాక్ మార్కెట్‌కు పోకుండా, అధిక ధరలకు అమ్మకుండా చర్యలు తీసుకోవచ్చు. వారు అంత చురుగ్గా వున్నట్లు కనుపించరు. ఇంతకూ కేంద్రం సబ్సిడీలు రద్దు చేసి ఎరువుల ధరలు పెరగడానికి వీలు కల్పించ బడడం; రాష్ట్ర ప్రభుత్వం వున్న స్టాకునైనా పాత ధరలకైనా అమ్మించలేక పోవడం; వ్యవసాయ, విజిలెన్స్ శాఖాధికారులైనా అప్రమత్తంగా లేకపోవడం రైతుల దురదృష్టమే. ఈ సంవత్సరం రైతు కొంచానికి కొంచమైనా సంతోషించ దగిన అంశం ధాన్యం మద్దతు ధరను కాస్త ఎక్కువ గానె పెంచడం!

## పంచాంగము

తేది 11 శుక్రవారం కృష్ణానది పుష్కరములు ప్రారంభము.
గురుమౌఢ్యమి జరుగుచున్నది.

### సెప్టెంబరు తిధులు

భాద్రపద శుద్ధ

| | | |
|---|---|---|
| తే 5 శని నవమి రా.గ. | 8.42 | వ |
| తే 6 ఆది దశమి రా.గ. | 9.30 | వ |
| తే 7 సోమ ఏకాదశి రా.గ. | 10.?5 | వ |
| తే 8 మంగళ ద్వాదశి రా.గ. | 12.28 | వ |
| తే 9 బుధ త్రయోదశి రా.గ. | 2.26 | వ |
| తే 10 గురు చతుర్దశి రా.గ. | 4.30 | వ |
| తే 11 శుక్ర పూర్ణిమ పూర్తిగ | | |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ


**ఇల్లు అమ్మబడును**

నెల్లూరు దర్గామిట్ట వాటర్ ట్యాంక్ వద్ద స్టేట్ బ్యాంక్ కాలనీలో ప్లాట్ నెం. 29, 33 అంకణముల స్థలంలో 13 అంకణముల కట్టుబడి గలిగి అన్ని ఆధునిక వసతులు గల యిల్లుఅమ్మబడును.

వివరములకు
వై. వినాయక్
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
బారక్స్, నెల్లూరు ఫోన్: 27538, 26704

**ఇల్లు అమ్మబడును**

నెల్లూరు స.వీరారుపేట డోర్ నెం. 15/425, గల (అలగాల దివాన వర్మకుమారి ఇల్లు) 15 అంకణముల స్థలంలో కట్టబడిన ఇల్లు అమ్మబడును.

వివరములకు కె. సుబ్బారావు, ది లీమన్స్ ఎవాంజలికల్ ఫెలోషిప్ మందిరం 24/710, వాటర్ ట్యాంక్ దగ్గర, మూలాపేట – నెల్లూరు.

విటమిన్ ఎ లోపాన్ని మునగాకు, కాయలు వాడకం ద్వారా పూరించడంతో చేసిన కృషి. గవర్నర్ సతీమణి ఎ. సుమన్ కృష్ణకాంత్ ద్వారా ప్రశంసా పత్రం స్వీకరిస్తున్న సుజన.

# మునగలో కావలసినంత 'ఎ' విటమిన్

మనం ఆకలితో ఉన్నప్పుడు ఏదో ఒకటి తిని ఆకలి తీర్చుకుంటాం. ఒకసారి ఆకలి తీరగానే తగినన్ని పోషక విలువలుగల ఆహారం వైపు దృష్టి మరల్చాలి. అందుకోసమే గ్రామీణుల్లో ప్రత్యేకించి, గర్భవతులకు స్కూలు కెళ్ళే చిన్నారి పిల్లలకు సంపూర్ణ పోషక విలువలుగల ఆహార పదార్థాలను అందించే పలు పథకాలను ప్రభుత్వం అమలు పరుస్తున్నది.

మనం తీసుకునే ఆహారం మనకు అవసర మైనంత శక్తిని, మాంస కృత్తులను, ఇతర విటమిన్లు, లవణాలను అందించ గలిగేటట్లు ఉండాలి. అందుకు అనుగుణంగా మన ఆహారపుటలవాట్లు మార్చుకోవాలి. పంటలు పండించుకోవాలి.

మన జిల్లాలోని పల్లెప్రజల్లో ఎక్కువగా విటమిను'ఎ'లోపం కనిపిస్తుంది. దీనివల్ల బాల్యంలో పెరుగుదల ఆగిపోతుంది. రేచీకటి వస్తుంది. చర్మ వ్యాధులు వస్తాయి. అంతేగాక శ్వాసకోశ వ్యాధులు గూడ వచ్చే అవకాశం వుంది. ఐతే ఇంత తీవ్ర పరిణామాలు కల్గించే విటమిను'ఎ' లోపాన్ని చవకగా దొరికే పండ్లు, కూరగాయల్ని తీసుకోవడం ద్వారా సరిదిద్దుకోవచ్చు.

విటమిను'ఎ' లోపం వల్ల ఎంతోమంది అంధత్వంతో బాధపడుతున్నారు. కాని, నూరు గ్రాముల ముల్లంగి ఆకులు ఆరుగురికి సరిపోయేంత విటమిను'ఎ'ని సరఫరా చేస్తాయి. అలాగే ఒకే సీజనులో పండే పంటలైన సొర, గుమ్మడికాయల్లో గుమ్మడిని ఎంచుకొని, సాగు చేయడం ద్వారా ప్రజలకు అత్యవసరమైన 'విటమిను ఎ' అందించవచ్చు. నారింజ రంగులో ఉండే గుమ్మడి ఎకరాకు 8వేల కిలోల దిగుబడినిస్తే, అందులో 27 కోట్ల అంతర్జాతీయ యూనిట్ల విటమిను 'ఎ' ఉంటుంది. ఎకరం నేలలో పండించ బడే తోటకూర నుంచి 25 కోట్లు, మెంతికూర నుంచి 15 కోట్లు, బచ్చలి కూరనుంచి 52కోట్ల అంతర్జాతీయ యూనిట్ల విటమిను'ఎ'ని పొందవచ్చు.

ఇంకా సులభంగా, సలీసుగా కావాలంటే మనం ఒడ్లో పెంచుకొనే మునగాకు నుంచి ప్రతి 100గ్రాములకు 6వేల నుంచి 35వేల యూనిట్లు, కాకరనుంచి 8వేల నుండి 20వేలు, బొప్పాయి నుండి 18వేల నుంచి 28వేల అంతర్జాతీయ యూనిట్ల విటమిను'ఎ'ని పొందవచ్చు.

ప్రతి మనిషికి రోజుకు 4వేల యూనిట్ల విటమిను 'ఎ' సరిపోతుంది. కాబట్టి మనకు అవసరమైన పోషక పదార్థాలను చాలా చవకగా, అందుబాటులో ఉండే పండ్లు, కూరగాయల్ని సాగు చేసి, వాటిని తినడం ద్వారా పొందవచ్చు. ఆరోగ్యంగా ఉండవచ్చు.

మసాలా దోశ, సమోసాల కల్చరును కాస్త పక్కన పెట్టి, ఆ డబ్బులతో పండ్లు, కూరగాయల్ని తినే కల్చరును అలవాటు చేసుకోవాలి. తద్వారా పోషక పదార్థాల లేమిని నివారించేందుకు మాత్రలు, సూదులు తీసుకొనే అవసరం రాదు. ప్రకృతి మన కందిస్తున్న వాటిని సద్వినియోగం చేసుకోగలిగితే ఆరోగ్యానికి ఆరోగ్యము, మందుల వాడకం నుండి విముక్తి!

**- శ్రీమతి ఎస్. సుజన**


**నర్సింగ్‌లో డిప్లొమా - శిక్షణ**

నర్సింగ్ కోర్సులో శిక్షణనిచ్చి నర్సింగ్ డిప్లొమా ప్రదానం చేయబడును. శిక్షణా కాలము 12 నెలలు. ఇంటర్మీడియట్ పాస్ అయివుండ వలెను. వయస్సు 18 - 23 మధ్య వుండవలెను. తెలుగు, తమిళము, ఇంగ్లీషు తెలిసి వుండవలెను. శిక్షణా కాలములో స్టైఫెండ్ మరియు వసతి సౌకర్యము కల్పించబడును. అన్ని వివరములతో మా దరఖాస్తును 10-9-1992 తేది లోపల మాకు చేరునట్లు పంపవలెను.

**HALSTED SCHOOL OF NURSING**

815 Poonamallee High Road
MADRAS - 600 010.


## సణుగుడు

అటువంటప్పుడు పత్రికలలో ప్రతిరోజూ వచ్చే మంత్రుల అవినీతి, అధికార్ల లంచాల కథలు చదివి జనం చెడిపోరా? సెక్స్ హింసల కంటే ప్రమాదకరమైనవి కావా అవి?

అదేమి పెడవాదం? అవినీతి కుంభకోణాలు వెల్లడైతే ఆ తప్పు చేసినవారు సరి దిద్దుకొంటారు తప్ప, వాటిని చదివి జనం చెడిపోతారా?

నిస్సందేహంగా! తాము అవినీతికి పాల్పడు తున్నట్లు తమంతట తాముగా ప్రచారం చేసుకొనే నాయకులు న్నారు తెలుసా అట్లయితే మంచి బేరాలొస్తాయని! బూతు కథలు చదివితే మహా అయితే ఊరికొక రేప్ జరగవచ్చు; కాని ఈ కుంభకోణాలు చదివి, చదివి యువతరంలో రాజకీయాలు, మంత్రి పదవులు వుండేది, ప్రభుత్వం ఉద్యోగాలిచ్చేది లంచాలు తినడానికేనన్న దురభిప్రాయం ఏర్పడడంతో పాటు తామూ అవకాశం చిక్కితే ఏదో ఒక కుంభకోణం సృష్టించి పత్రికలకెక్కాలన్న తహతహ పెరుగుతుంది. సమాజంలో అవినీతి అనేది ఒక అర్హతగా, సమర్థతకు చిహ్నంగా పరిగణన అవుతున్నది. అందువల్ల ప్రభుత్వం ఒక స్పెషల్ ఆర్డినెన్స్ ద్వారా /పత్రికల్లో స్వాహా కథనాలు ప్రచురించరాదని నిషేధం విధిస్తే మంత్రులకూ సౌకర్యం - టేబిల్ క్రింద నుంచి కాక పై నుంచే ఘరానాగా ముడుపులందు కోవచ్చు; కొత్తగా రాజకీయాలలోకి వచ్చేవారికి అవినీతి గురించి తెలియకుండా దాచిపెట్టడం వల్ల, వారి నుంచి పోటీ లేకుండా, వాటాల బెడద రాకుండా మొత్తం ఒకరే భోం చేయవచ్చు!

మరి పత్రికలకు పని?

పత్రికలకేమీ ఇబ్బంది వుండదు. కుంభకోణాలు నిషేధించి, బూతు కథలకు లైసెన్సులిస్తే - ప్రతపత్రికా ఉత్తమ శృంగార కథలకు, సీరియల్స్‌కు పోటీపెట్టి, మిస్ సెక్సిణి కంటెస్టులు నిర్వహించి, పంచరంగుల్లో బొమ్మలు ముద్రించి తమ సర్క్యులేషన్ను వేల నుంచి లక్షలకు పెంచుకుంటాయి. పడకటింటి రహస్యాలు శోధించి, పరిశీలించడానికి తెలుగు దిన పత్రికలు వార్డుకి ఒక విలేఖరిని కాక, వీధికి ఒక రిపోర్టర్ను నియమించి నిరుద్యోగ సమస్యనూ పరిష్కరిస్తాయి! జనానికి మంచి కాలక్షేపం, పత్రికల పట్ల ఆసక్తి పెరిగి రీడర్‌షిప్ రెట్టింపౌతుంది. ప్రజలంతా విజ్ఞాన వంతులౌతారు. స్టార్ టివి కంటే ధీటుగా తెలుగు పత్రికలు తయారౌతాయి.

ఈ ఐడియా ఏదో బాగానే వున్నట్లుంది, ప్రధాన మంత్రికి జాబు వ్రాసి చూద్దాం!

* * *

మొన్న నెల్లూరులో హత్యకు గురైన ఒక రౌడీ శవంపై కాంగ్రెస్ జెండా కప్పి, గౌరవించారటనే!

అవును, అతడు కాంగ్రెస్ నాయకుల కుడిభుజం వంటి వాడు!

కాంగ్రెస్ జెండాను శవాలపై కప్పే గుడ్డ పీలికగా మార్చడం ఘోరం కాదా?

4 పేజీ కొరవ

కనీసం ఆ సమయంలోనైనా తమ పార్టీకి జెండా ఒకటి వుందన్న సంగతి గుర్తు చేసుకొనే నాయకులు కాంగ్రెస్‌లో వున్నందుకు సంతోషించు; ప్రతి దానికి సణుగుడేనా?

## మల్లీ స్లంప్

7 పేజీ కొరవ

షూటింగ్ డేట్స్ ఇచ్చి, అడ్వాన్స్ కూడా చెల్లించారు. అగ్రిమెంట్ మీద ఆమె సంతకం తీసుకోకపోవడం వాళ్ళు చేసిన పొరపాటు. ఆగస్టు 7వ తేదీ నుంచి సెప్టెంబర్ 7 వరకు తిరుపతిలో తొలి షెడ్యూల్ ప్లాన్ చేశారు. ప్రారంభోత్సవానికి ముందు యమున ఇంటికి నిర్మాతలు ఫోన్ చేస్తే, రిసీవర్ అందుకున్న ఆమె తల్లి " ఆ తేదీలలో రావడానికి ఎలా వీలవుతుంది? రామానాయుడుగారి సినిమా షూటింగ్ ఉంది. కావలిస్తే ఆగస్టు 25 నుంచి అమ్మాయి మీ షూటింగ్‌లో పాల్గొంటుంది, " అందట. నిర్మాతలు తమ ఇబ్బందులు ఎంత చెప్పినా ఆ తార తల్లి పట్టించు కోలేదు. ఈలోగానే ఆ తపస్వి ఆర్ట్ క్రియేషన్స్ యూనిట్ తిరుపతికి చేరుకుంది. యమున ఆనిర్మాతలను కాంటాక్ట్ చేయడం తన కనీస ధర్మంగా భావించలేదు. ఆఖరి క్షణంలో ఆమె షూటింగ్‌కు రానందువల్ల నిర్మాతలకు దాదాపు రెండున్నర లక్షల రూపాయల నష్టం వాటిల్లింది. తారలు ఎప్పుడు డేట్స్ ఇస్తే అప్పుడు నిర్మాతలు షూటింగ్ పెట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడింది! నిర్మాతలకు దిగ్భ్రమ కల్గించిన మరో విశేషమేమిటంటే -హైదరాబాద్‌లో రామానాయుడి చిత్రం షూటింగ్‌కు వెళ్తున్నానన్న యమున ఆ సమయంలో తిరుపతిలోనే మరో మూల మరో చిత్ర నిర్మాత షూటింగ్‌లో పాల్గొనడం ! ఇప్పుడు పై చిత్రంలో యమున స్థానే దివ్యవాణి నటిస్తోంది.

## చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

ఈ దృశ్యమూ గొప్పగా వుంది. గంగ హాస్పిటల్లో బిడ్డను ప్రసవించటం, అదే సమయంలో రాజా ప్రాణాలు వదలటం చూపారు. అంటే రాజా తన ఊపిరిని తన బిడ్డకు పోసినాడన్న భావనతో చిత్రీకరించిన దృశ్యం గొప్పగా వుంది.

తండ్రిగా తమ బాధ్యతలను తన భుజస్కందాల మీద మోసి దహన సంస్కారాలు జరపటం ఒక మంచి విప్లవ ధోరణికి దారిచూపింది. అదే విధంగా రాజా ఫోటోకు పూలదండ వెయ్యనివ్వదు గంగ. దానికి ఆమె చెప్పిన కారణం , ఆయన మన మధ్య బ్రతికే వున్నాడు. నాకు ఆయన సజీవ ప్రతి రూపాన్నిచ్చాడు. మీకు మీరు కోరుకున్న జీవిత భాగస్వాముల నిచ్చారు. మన జీవితాల్లో జీవమున్న పనులు చేశాడు. కాబట్టి ఆయన మనమధ్య జీవించే వున్నాడు. అని చెల్లెళ్ళకు చెప్తుంది. ఇదీ సనాతన సాంప్రదాయాన్ని మార్చిన పద్ధతి. మొత్తం మీద చిత్రం వెలుగుచీకట్ల జీవన రంగంలో ఒక విద్యుత్ తరంగంలా వెలుగొందుతూ ఉంది.

రాజ్-కోటి సంగీతం కమ్మగా వుంది. గంగ నవ్వుతున్నప్పుడంతా శాస్త్రీయ బాణీలు వాడటం సొగసును సంతరించుకుంది. రాజా సంగీత జ్ఞానం లేదనే గాని , "భజన సేయవే" అనే త్యాగరాజ కీర్తన ముకుటాన్ని కార్మిక లోకానికి వారి శ్రమకు అనువుగా మార్చివేటూరి వ్రాసిన పాట బాగుంది. దాని సంగీతం చిత్రీకరణ ఆమోద యోగ్యంగా వున్నాయి. హరిఅనుమోలు కెమెరా చిత్రాన్ని ఒక దృశ్యకావ్యంగా మార్చింది. గణేష్ పాత్రో మాటలు గొప్పగా కూర్చాడు.

డాక్టర్ రాజశేఖర్ తన పాత్రకు, చిత్రానికి జీవం పోశారు.తన నట జీవితంలో మరో మైలు రాయి ఏర్పరచుకున్నాడు. సుహాసిని ప్రథమంలో చిలిపిగా, ఆ తర్వాత పెద్దమనిషిగా చక్కగా నటించింది. మిగతా అంతా తమ పాత్రలు బాగా పోషించారు.

## నెల్లూరు జిల్లా జడ్జి కోర్టులో

O.P. No. 4/92

In the matter of Late Mandaleika Chandra Sekhar Rao

1. M.P. Rajyalakshmi and another - Petitioner

Vs

2. M.V.L. Narasimha Rao and others - Respondents

To,
M.V.L. Narasimha Rao,
S/o. Subba Rao, Employee,
Flat No. 17, Devanadhan Street, Raja Annamalaipuram,
MADRAS - 98. అనువారికి

యీ నంబరున లేటు మండలైక చంద్రశేఖర రావుకు రావలసిన పిటీషను షెడ్యూలులో చూపిన ఆస్తులను రాబట్టు కొనుటకు గాను, Succession Certificate ను గ్రాంటు చేయమని పిటీషనర్లు పై నెంబరు పిటీషను దాఖలు చేసినందులకు గాను నీకు నోటీసు నిమిత్తం 18.9.92 తేదిన వాయిదా వేసియున్నది. కాన యిందు విషయమై నీకు గల ఆక్షేపణలను వాయిదా రోజు ఉదయం 10.30 గంటలకు పై కోర్టువారి యెదుట హాజరై తెలుపుకొనేది. లేని యెడల నీ పరోక్షమున కేసు విచారించి తీర్మానించబడును.

జి. బాబులు

పిటీషనర్ల తరపు అడ్వొకేటు
నెల్లూరు.

## ఆత్మకూరు డి.ము వారి కోర్టులో

IA 731/89 OS 172/85

స్టేట్ బ్యాంక్ అఫ్ ఇండియా
-పిటీషనరు/వాది

మాకినేని మాలకొండయ్య
-రెస్పాండెంటు/ప్రతివాది

To,
మాకినేని మాలకొండయ్య
S/o. వరసయ్య, హేమానగర్
ఎ.ఎస్.పేట మండల్

పై నంబరు దావాలో పిటీషనరు నీ మీద ఫైనల్ డిక్రీ పిటీషన్ పెట్టినందున నీకు నోటీసు నిమిత్తము 18.9.92 తేది నాటికి వాయిదా వేయబడినది. కనుక నీవు పై తేదిన పై కోర్టులో పగలు 10.30 గంటలకు హాజరై నీకు గల ఆక్షేపణలను తెలుపుకొనవలసినది. లేని యెడల నీ పరోక్షమందు ఎక్సపార్టీగా తీర్మానించబడును.

యస్. మహాదేవరెడ్డి

వాది అడ్వొకేటు

# కృతజ్ఞతా సుమాంజలి

తమ పనిలో తలమునకలై వుండి కూడా

మా ఆహ్వానాన్ని ఎవ్వరూ ఊహించని రీతిలో స్వీకరించి మా

## సుమాంజలి అపార్ట్‌మెంట్స్

శంకు స్థాపన చేసిన

## శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారికి

పత్రికా ముఖంగా మేము తెలియచేయు ఈ కృతజ్ఞతలు

ఆయన చేసిన సహాయానికి ఎంతైనా తక్కువే.

ఇక శ్రీ కె.వి. సుబ్బారెడ్డి గారు చేసిన మేలు మేము ఎప్పటికి మరువలేము

శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి గారికి

శ్రీ నేదురుమల్లి పద్మనాభ రెడ్డిగారికి

శ్రీ చేవూరి దేవకుమార్ రెడ్డి గారికి

ఇదే సుమాంజలి సమర్పిస్తున్న నమస్సుమాంజలి.



కొమ్మూరు సుధాకరరావు

నవాబ్‌పేట, నెల్లూరు




Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Navagara Books (Pvt) Ltd.